# చందమామ

ఈ సంచికలో కథలు, వింతలు - విశేషాలు



ఇవి గాక ఫోటో శీర్షికల పోటీ, మరి ఎన్నో ఆకర్షణలు.

# అన్నివంటలకు శ్రేష్ఠమైన నూనెలు

అగ్‌మార్కు కాబడిన
ఎ.యస్. బ్రాండ్..
**చాయపప్పు నూనె**




అగ్‌మార్కు కాబడిన
మేన్షన్ బ్రాండ్......
**నువ్వులనూనె**




- గోదావరిడెల్టా నువ్వులనుండి ఆరోగ్యకరమగుప్రత్యేకపద్ధతులతో తయారుకాబడినవి.
- రుచి,రంగు,సువాసనలతో అన్నివంటుపదార్థములను అమితమగురుచివంతముగ చేయును.
- ఊరగాయలను చాలకాలము నిలువయుంచును. ముక్కును మెత్తబడనీయవు,బూజుపట్టనీయవు.
- తలకు వాడినయెడల మెదడుకు చలువచేయును. వెంట్రుకలను బాగుగా పెరుగునట్లు చేయును.
- 16,4,2. కి.గ్రా.డబ్బాలలో పేకింగు చేయబడుచున్నవి.

ఏజెంట్సు :

శ్రీ మాజేటి వీరరాఘవయ్య,
కమీషను మర్చంటు,
శివాలయం వీధి, విజయవాడ

Ms. పెరుమాళ్ళు & కో,
137, ఆదియప్పనాయక్ స్ట్రీట్,
మదరాసు

Ms. B.V. రావు & కో,
136, పురశువాకం హైరోడ్, మదరాసు

MFRS, అంబటి సుబ్బన్న & కో. సామర్లకోట









New




by

**THE NATIONAL TRADING CO.**

Manufacturers of

**KASHMIR SNOW BEAUTY AIDS**

BOMBAY-2. MADRAS-32.

తెల్లార్తే లత పుట్టినరోజు చాలామంది స్నేహితులకు ఆహ్వానాలు అప్పుడే పంపడమైంది. కానీ పద్మకిప్పుడు ఒకటే పెద్ద సమస్య!

వానాకాలం రోజులివి కట్టెలు తడిగా వుండి మండవు ధరకూడా ఎక్కువే!



చింతిస్తూవున్న పద్మను చూసేందుకు వస్తుంది ఎదురింటి గీత

ఓడ మునిగిపోయినా చెంపపైచేయిపెట్టుకోవ క్కరలేదే పద్మా! నీకుఇప్పుడేం విచారం?



ఒకటే విచారం గీతా! వంటకు లభించేవి తడి కట్టెలే! పైగా ధరకూడా అధికం ఏం చెయ్యాలో బోధ పడటం లేదు!

ఓష్! ఇందుకేనా యింత విచారం! చేతిలో వెన్నపెట్టుకొని నెయ్యికై వెదికినట్టుంది. "లీకో" వుండగా ఎందుకింత విచారం

నేను కూడా 'లీకో' గురించి విన్నాను. కాని వాడి చూడలేదు సుమా!



'లీకో' తక్కువ ధరకు లభిస్తుంది! అతి సాధుమైనది. పొగలేక చక్కగా మండుతుంది. అన్నిరకాల బొగ్గు పొయ్యిలకు తగినట్టిది. వంట కూడా త్వరగా ముగిస్తుంది. రేపటి నుంచే 'లీకో'ని వాడి చూడండి!



గీతా, ఇంద ఇంకొక గ్లాసు పాయసం. నీ సలహాకి చాలా కృతజ్ఞురాల్ని. నాకూ తృప్తి అందరికీ సంతోషం. ఇక ఎప్పుడూ 'లీకో' నే కొనాలని తీర్మానించుకున్నా



LECO

# లీకో

నైవేలి లిగ్నైట్ కార్పొరేషన్, లిమిటెడ్, నైవేలి-1.

FDS NLC 735 TE A

# ఇప్పుడే...
# మీ సహాయం
# అవసరం!

"మన మందరమూ ఒకే జాతికి చెందినవారము. మనమంతా ఒకే ప్రజ. బీహారు, ఉత్తరప్రదేశ్, ఇతర అనావృష్టి ప్రాంతాలలో వచ్చిన ఆపద యావద్భారతదేశానికే వచ్చిన ఆపద. మనమంతా కలిసి అనావృష్టి పరిస్థితుల్ని ఎదుర్కొనాలి. కష్టసుఖాలను మనమంతా కలిసి పంచుకోవాలి. ఉజ్వల భవిష్యత్తుకు మనం ఐక్యంగా కృషి చేయాలి."

**ఇందిరా గాంధి**
ప్రధాన మంత్రి

ప్రధాన మంత్రి కరువు సహాయక నిధికి
ఉదారంగా విరాళ మివ్వండి.

విరాళాలను నగదు రూపంలో కానీ, వస్తు రూపంలో కానీ
ఈ క్రింది చిరునామాకు పంపండి.

ప్రధాన మంత్రి కరువు సహాయక నిధి,
క్యాబినెట్ సెక్రటేరియట్, రాష్ట్రపతి భవన్,
న్యూ ఢిల్లీ - 4.

# క్రొత్త
# టినోపాల్ యొక్క మితవ్యయ ప్యాక్




టినోపాల్ యిపుడు కొత్త మితవ్యయ ప్యాకులో కూడా దొరుకుతుంది. ఇప్పుడు బట్టలను యిది వఒకటి కంటె తక్కువ ధరలో తెలుపు చేయవచ్చును—టినోపాల్ యొక్క కొత్త మితవ్యయ ప్యాకుతో—నేడే కొనండి ఒక ప్యాక్ చాలా రోజులు వచ్చును—చాలా పొదుపుచేయును. మీ కుటుంబము యొక్క బట్టలను ఎప్పుడునూ టినోపాల్‌లోనే తెలుపుచేయుడు. శాస్త్రయుక్తమైన తెలుపుచేయువస్తువు. చెంచాలో నాల్గవవంతు ఒక బాల్చీడు బట్టలను తెలుపు చేయును.

సర్వోత్తమ తెలుపుకోసం టినోపాల్

---

ఏరుకొనుటకు మూడు టినోపాల్ ప్యాకులు :




బాల్చీకి సరిపోయే పొట్లము




రెగ్యులర్ ప్యాక్




కొత్త మితవ్యయ ప్యాక్

---



® 'టినోపాల్' జె. ఆర్. గెగీ, ఎస్. ఏ. బాల్, స్విట్జర్లెండ్ వారి రిజిస్టర్డ్ ట్రేడ్ మార్కు

సుహృద్ గైగీ లిమిటెడ్, పోస్టు బాక్సు నంబరు 965, బొంబాయి-1 (బి.ఆర్.)

shilpi sgt 27a/67 tel




# ఫోర్‌హాన్స్‌తో దంతసంరక్షణను నేర్పండి

ఆమె శక్తిసామర్థ్యాలు పెరుగుతున్నాయి. మీ శిక్షణలో ముమ్ముందు ఆమె అనేక ముఖ్య విషయాలు నేర్చుకుంటుంది. సరియైన దంతసంరక్షణ ఆమెకు తప్పక నేర్పండి. ఫోర్‌హాన్స్ ఏ విధంగా ఇగుళ్ళ జబ్బులను, పంటిక్షయమును నివారింపగలదో చెప్పండి. ఇదే మంచి సమయం ఎందుకంటే, తన పళ్లు జీవితకాలమంతా ఉండాలి.



ఫోర్‌హాన్స్ టూత్‌పేస్టు ఒక దంతవైద్యుడు నిర్మించింది. అందులో బిగువైన ఇగుళ్ళకు కావలసిన ప్రత్యేకమైన మందులున్నాయి. ఈ టూత్‌పేస్టు మీకు మంచిదని, మీ అమ్మాయికి కూడా మంచిదని మీకు తెలుసు. ప్రతి రాత్రి, ప్రతి ఉదయం ఫోర్‌హాన్స్‌తో పళ్లుతోముకోవడం ఆమెకు నేర్పండి. జీవితకాలమంతా ఆమె పళ్లు సురక్షితంగా ఉంటాయి.

## జాగు చెయ్యక ఫోర్‌హాన్స్‌తో దంతసంరక్షణ ఇప్పుడే నేర్పండి




ఉచితం: "పళ్లు ఇగుళ్ళను గురించి తీసుకోవలసిన శ్రద్ధ"* అనే పుస్తకం రంగుచిత్రాలలోనున్న ఈ పుస్తకం అనేక విషయాలను తెలుపుతుంది. పది భాషల్లో† దొరుకుతుంది. (తపాలా ఖర్చుకు) 10 పై. బిళ్ళలు పంపండి. అడ్రసు: మానర్స్ డెంటల్ అడ్వైజరీ బ్యూరో, పోస్టు బ్యాగు నం. 10031, బొంబాయి-1.

పేరు ..........................................................

అడ్రసు ........................................................

† మీకు కావలసిన భాష క్రింద గీతపెట్టండి: తెలుగు, ఇంగ్లీషు, హిందీ, మరాఠీ, గుజరాతీ, ఉర్దూ, బెంగాలీ, అరవం, మలయాళం, కన్నడ.

* ఈ పుస్తకం అతడు చదివే పుస్తకాలలో కెల్ల ముఖ్యమైనది కావచ్చు

**ఫోర్‌హాన్స్** టూత్‌పేస్టు—ఒక దంతవైద్యుడు నిర్మించినది

CMGM-19F C TL

"C. 1"



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

"సింహము—ఎలుక" కథ అందరికీ తెలిసినదే. అన్ని మృగాలకూ రాజయిన సింహం వేటగాడి ఉచ్చులలో చిక్కి, అపాయంలో పడినప్పుడు ఒక చిట్టెలుక రక్షిస్తుంది. కథ పాతదే అయినా అందులోని నీతిని మనం మరిచిపోతూ ఉంటాం. అదే నీతిని బోధిస్తుంది "ప్రత్యుపకారం" అన్న కథ. ఈనాడు కొన్ని బలమైన దేశాలూ, దుర్బలమైన దేశాలూ ఉన్నాయి. దుర్బలమైన దేశాల వల్ల తమకు ఉపయోగం ఉంటుందని బలమైన దేశాలు గ్రహించటం అవసరం.

సంపుటి 42 సెప్టెంబర్ '67 సంచిక 3

CHITRA



# భారత చరిత్ర




1757 జూన్ 22 న క్లైవు తన సేనలతో సహా భాగీరథీ నదీతీరాన ప్లాసీ వద్ద గల మామిడితోపు వద్ద దిగాడు. నవాబు సైనిక బలాలన్నీ రాజద్రోహం చేశాయి. హుగ్లీ వద్దనూ, కాత్వా వద్దనూ గల నవాబు బలాలు ఇంగ్లీషువారిని నిరోధించ యత్నించ లేదు. నవాబు సేనలు ప్లాసీ వద్ద అదివరకే స్థావరం ఏర్పచుకుని ఉన్నాయి.

జూను 23 ఉదయం ఉభయ పక్షాలకూ యుద్ధం ప్రారంభమయింది. పెద్ద పెద్ద సేనలను వెంటబెట్టుకుని ఉన్న మీర్ జాఫర్ గాని రాయ్ దుర్లభ్ గాని కదిలి యుద్ధానికి రాలేదు. ఒక ఫ్రెంచి అధికారిని సహాయం తీసుకుని మోహన్‌లాల్, మీర్ మదన్ అనేవాళ్ళు కొద్ది బలాలతో యుద్ధరంగానికి వచ్చారు. ఈ కొద్ది సేనతోనే అరగంటసేపు పోరిన మీదట క్లైవు తన బలాలను చెట్లమాటుకు తీసుకుపోయాడు; మీర్ జాఫర్ ద్రోహం చెయ్యక తన బలాలను యుద్ధానికి తెచ్చినట్టయితే ఇంగ్లీషువారికి ఘోరపరాజయం కలిగివుండేది.

వెకక్కు తగ్గిన క్లైవు తన సైనికాధికారులతో సంప్రతించి, రోజల్లా శత్రువుపై ఫిరంగులు పేల్చటానికీ, అర్ధరాత్రివేళ నవాబు శిబిరాన్ని దొమ్మి చేయటానికీ తీర్మానించాడు. అయితే ప్రమాదవశాన ఒక ఫిరంగిగుండు వచ్చి తగిలి మీర్ మదన్ చనిపోయాడు. నవాబు బెదిరిపోయి, మీర్ జాఫర్‌ను పిలిచి సలహా అడిగాడు. ఆ ద్రోహి నవాబుకు, యుద్ధం చేస్తున్న సేనలను ఉపసంహరించమని సలహా ఇచ్చాడు.

నవాబుగారి ఉపసంహరణ ఉత్తరువు అందే సమయానికి మోహన్‌లాల్ ఇంగ్లీషు బలాలపై తీవ్రంగా తుపాకిగుళ్ళ వర్షం కురిపిస్తున్నాడు. అతని సైనికులు క్షేమకరమైన మాట్ల నుంచి కాల్పులు చేస్తున్నారు.

## 72. ప్లాసీ యుద్ధం

"యుద్ధవిరమణకు ఇదా సమయం? జయాపజయాలు ఇప్పుడే తేలిపోనున్నాయి," అని మోహన్‌లాల్ నవాబుకు జవాబు పంపాడు.

నవాబు మీర్ జాఫర్ కేసి చూశాడు. మీర్ జాఫర్ బెట్టుగా, "నాకు తోచిన సలహా చెప్పాను. ఆ పైన ఏలినవారు ఏం చేసినా సరే," అన్నాడు.

మీర్ జాఫర్ వైఖరి చూసి, అసలే భయపడిపోతున్న నవాబు మరింత బెదిరిపోయి, సేనను ఉపసంహరించమని మోహన్‌లాల్‌కు కబురు మీద కబురు పంపాడు. చిట్టచివరకు, ఎంతో ముందుకు వెళ్ళిన మోహన్‌లాల్ తన సేనను వెనక్కు తీసుకు రావలసి వచ్చింది.

మోహన్‌లాల్ సైనికులు వెనక్కు తిరిగి వచ్చేటప్పుడు, విద్రోహులైన సైనికముఠాలు యుద్ధరంగం నుంచి పారిపోతూండటం కనబడింది. అది చూసి వీళ్ళు కూడా పారిపోసాగారు. చివరకు సైనికుల పలాయనం అంతకంతకూ బహిరంగంగానూ, భారీగానూ జరిగి, కొద్దిసేపట్లోనే శిబిరం పూర్తిగా ఖాళీ అయిపోయింది!

ఈ సంగతి విని నవాబు సిరాజుద్దౌలా నిర్ఘాంతపోయాడు. ఎదట ఉన్న ఇంగ్లీషు



శత్రువులూ, తన చుట్టూ ఉన్న విద్రోహులూ కలిసి అతనికి ఉన్న మతి కూడా పోగొట్టారు. అతను కూడా పారిపోయాడు. ఆ రాత్రి అంతా ప్రయాణం చేసి, మర్నాడు ఉదయం 8 గంటలకు అతను ముర్షిదాబాద్‌లోని తన రాజభవనాన్ని చేరుకున్నాడు.

అపజయ వార్తతో ముర్షిదాబాదు అల్లకల్లోలమయింది. సిరాజుద్దౌలా తిరిగి తన బలాలను కూడగట్టుకోవాలని యత్నించాడు. తనకు అండగా నిలబడినవారికి అంతులేని డబ్బు ఇస్తానన్నాడు. కాని జనం అతన్ని చూస్తూనే చెల్లాచెదరుగా పారిపోయారు. ఇక గత్యంతరంలేక అతను తన భార్య

అయిన లుత్ఫున్నిసాను వెంటబెట్టుకుని, ఒక సమ్మెనబంటుతో సహా నగరం విడిచి వెళ్ళిపోయాడు.

నవాబు వచ్చిన మర్నాడు—జూను 25 న-మీర్ జాఫర్ ముర్షిదాబాదు చేరాడు. మరికొన్ని రోజులకు క్లైవు కూడా అక్కడికి వచ్చాడు. మీర్ జాఫర్ బెంగాలుకు సుబేదారుగా ప్రకటన జరిగింది. మరికొన్ని రోజుల అనంతరం సిరాజుద్దౌలా పట్టుబడి, ముర్షిదాబాదుకు తీసుకురాబడ్డాడు. వెంటనే మీర్ జాఫర్ కొడుకు మీరన్ అనేవాడు సిరాజుద్దౌలాను హత్య చేయమని ఉత్తరు విచ్చాడు. ఈ విధంగా నవాబు పైన మీర్ జాఫర్ చేసిన కుట్ర సఫలమయింది. క్లైవుకూ, అతని అనుచరులకూ పుష్కలంగా బహుమానాలు ముట్టాయి. 24-పరగణాలు జమీందారీగా లభించింది. ఇంగ్లీషు కంపెనీకి బోలెడంత డబ్బు కూడా ఇవ్వబడింది.

ప్లాసీయుద్ధం నిజానికి పెద్ద యుద్ధమే కాదు. కాని ఎన్నో మహాయుద్ధాల కన్న దీని నుంచి హెచ్చు పరిణామాలు ఏర్పడ్డాయి. దీని మూలానే బ్రిటిషువారు ముందుగా బెంగాలునూ, దరిమిలా యావద్భారతాన్నీ తమ అధీనంలోకి తెచ్చుకోవటం జరిగింది. ఈ యుద్ధంలో క్లైవ్ గొప్పయుద్ధ నైపుణ్యం చూపాడన్నది పూర్తిగా కట్టుకథ. అదేవిధంగా, సిరాజుద్దౌలా దేశం కోసం పోట్లాడాడనేదీ, మీర్ జాఫర్ దేశద్రోహం చేశాడనేదీ నిజం కాదు. వాళ్ళు తమ తమ స్వార్థాలే చూసుకున్నారు.

ప్లాసీ యుద్ధం అనంతరం క్లైవు స్థితి డక్కనులో డూప్లే స్థితికన్న గొప్పది కూడా కాదు. ఈ యుద్ధం తరవాత బెంగాలులో కలిగిన పరిణామాలు మీర్ జాఫర్ వర్తనను బట్టీ, బెంగాలు రాజకీయ వ్యవస్థను బట్టీ ఏర్పడినవి.





# ప్రత్యుపకారం

హిమాలయాలలో ఒక నదికి దక్షిణాన ఒక చిన్నదేశం ఉండేది. ఒకనాడు ఆ దేశపు రాజు తన భవనంలో కొలువుతీరి ఉండగా, ద్వారపాలకుడు వచ్చి, "మహాప్రభూ, ఎలుకలరాజు వచ్చి తమ దర్శనం కోరుతున్నాడు," అని చెప్పాడు.

ప్రపంచంలో ఎలుకలకు కూడా ఒక రాజు ఉండటమూ, ఆ ఎలుకరాజు మాట్లాడగలగటమూ తలచుకుని అబ్బురపడి, "లోపలికి ప్రవేశపెట్టు," అని రాజుగారు ద్వారపాలకుడితో అన్నాడు.

తరవాత ఒక ఎలుక రాజలాంఛనాలతో ఠీవిగా నడుచుకుంటూ లోపలికి వచ్చింది. దాని వెనకఎలుకభటులు కూడా వచ్చాయి. రాజుగారు ఎలుకరాజుకు స్వాగతం చెప్పి, వచ్చిన పని అడిగాడు.

"రాజా, ఈ ఏడు పంటలు సరిగా పండక మా ఎలుకప్రజలకు దారుణమైన క్షామపరిస్థితి ఏర్పడింది. తాము మాకు ధాన్యం అరువివ్వకపోయినట్టయితే మేము తిండికిమాడి నశించిపోవలిసి వస్తుంది," అన్నది ఏలుకరాజు.

"ధాన్యం అరువిస్తాను. మీకు ఏపాటి ధాన్యం కావలిసి ఉంటుంది?" అని రాజుగారు అడిగాడు.

"ఒక పెద్ద కొట్టెడు ఇప్పించండి. వచ్చే పంటలో నుంచి మీ బాకీ వడ్డీతో సహా తీర్చుతాం," అన్నది ఎలుకరాజు.

"కొట్టెడు ధాన్యమే? అదంతా ఎలా పట్టుకుపోతారు?" అన్నాడు రాజు ఎంతో ఆశ్చర్యంగా.

"అదంతా మాకు వదిలెయ్యండి," అన్నది ఎలుకరాజు.

తన కున్న ధాన్యపుకొట్లలో కెల్లా పెద్ద కొట్టు తెరిపించమని రాజు ఉత్తరువిచ్చాడు. ఆ రాత్రికి కొన్నిలక్షల ఎలుకలు

ఏ. రామగోపాలరావు



వచ్చి, కొట్లో ఒక్క గింజ కూడా మిగల్చకుండా ధాన్యమంతా పట్టుకుపోయాయి. మర్నాడు రాజు వెళ్ళి చూస్తే కొట్టంతా ఖాళీ అయి ఉన్నది.

"మొత్తంమీద ఈ ఎలుకల ప్రజ్ఞ గొప్పది," అన్నాడు రాజు తన సభికులతో.

తిరిగి పంటలు రాగానే ఎలుకలు తాము అరువు పుచ్చుకున్న ధాన్యానికి వడ్డీ కింద మరికొంత చేర్చి రాజుగారి ధాన్యాగారానికి చేరవేశాయి.

"ఈ ఎలుకలకు ప్రజ్ఞతో బాటు నిజాయితీ కూడా ఉన్నది, సుమా!" అన్నాడు రాజు తన సభికులతో.

కొంతకాలం గడిచింది. మన రాజుండే రాజ్యానికి సరిహద్దున గల నదికి ఉత్తరంగా ఉండే రాజు మన రాజు పైన దండెత్తి వచ్చి, తన సేనలతో సహా నది అవతలి ఒడ్డున విడిశాడు.

శత్రురాజు చాలా బలవంతుడు. యుద్ధంలో అపజయం తప్పదనుకుని మన రాజు విచారంగా కూర్చుని ఉండగా, ఎలుకరాజు ఆయన దర్శనార్థం మళ్లీ వచ్చినట్టు లోపలికి కబురు వచ్చింది. ఎలుకరాజును ప్రవేశపెట్టమన్నాడు రాజు.

ఎలుకరాజు వచ్చి, "నేను ఈ తరుణంలో ఏమైనా సహాయం చెయ్యగలనేమో తెలుసుకునేటందుకు మరొకసారి తమ దర్శనం చేసుకుంటున్నాను. నేను మొదటి సారి తమ దర్శనం చేసుకున్నప్పుడు తమరు మా ప్రజలకు మహోపకారం చేసి ఉన్నారు. అందుచేత ఇప్పుడు మా వల్ల తమ కేదైనా సహాయం కలిగేటట్టుంటే మేం చాలా సంతోషిస్తాం," అన్నది.

అంత విచారంలోనూ రాజుకు చిరునవ్వు వచ్చింది. ఈ ఎలుక కొంచెమైనా, దీని మాటలు చాలా పెద్దగా ఉన్నాయి.

"మీ సదుద్దేశానికి నే నెంతైనా కృతజ్ఞుణ్ణి. కాని నన్ను ఈ స్థితిలో మీ ఎలుకలు ఎలా



ఆదుకుంటాయి? శత్రువు బలవంతుడు. అతని సేన నా సేన కన్న చాలా రెట్లు పెద్దది. ఆ సేన వచ్చి మా సరిహద్దు మీద, నది అవతలి గట్టున తిష్ఠవేసి ఉన్నది. వాళ్ళను జయించటం మాట దేవుడెరుగు, వాళ్ళు నది దాటిరాకుండా చేసే శక్తి కూడా నా సేనకు లేదు," అన్నాడు రాజు.

"ఒకప్పు డిలాగే మా శక్తిని తమరు శంకించారు. కాని మేము ధాన్యం పట్టుకుపోయి, తిరిగి ఇచ్చి, మీ అనుమానాలు నిరాధారమైనవని రుజువు చేశాం. మాలో విశ్వాసం ఉంచండి. మీరు-మాకు కొద్దిపాటి తోడ్పాటు ఇచ్చినట్టయితే మీ శత్రుసేనను వెనక్కు పంపేస్తాం. మీరు ఈ రాత్రి చీకటి పడే లోపుగా ఒక లక్ష కర్రపుల్లలు, మూరెడేసి నిడివి గలవి నదీతీరాన, నీటికి సమీపంలో పెట్టించండి. అంతకన్న మరేమీ చేయ నవసరం లేదు," అన్నది ఎలుకరాజు.



ఎలుకలు తనకు సహాయం చేసినా, చెయ్యలేకపోయినా, ఎలుకరాజు కోరినది అసాధ్యమైనది కాదు గనక, రాజు తన భటుల చేత ఒకలక్ష కర్రపుల్లలు నది ఒడ్డున సోల్పుగా పెట్టించాడు.

అ రాత్రి కొన్ని లక్షల ఎలుకలు నదీ తీరానికి వచ్చి, ఒక్కొక్క కర్రపుల్లనూ నీటిలోకి తోసి, ఒక్కొక్క పుల్ల మీదా మూడేసి, నాలుగేసి ఎక్కి, ఆ పుల్లలను తెప్పలుగానూ, తమ తోకలను తెడ్లుగానూ ఉపయోగించి అర్ధరాత్రి వేళకు అవతలి ఒడ్డు చేరాయి.

శత్రు సైనికులు గాఢనిద్రలో ఉన్నారు. ఇన్ని లక్షల ఎలుకలూ ఆ శిబిరం మీద పడి నిశ్శబ్దంగా విలుతాళ్ళన్నిటినీ కొరికేశాయి, సైనికుల దుస్తులన్నీ బొక్కలు కొట్టేశాయి, సంచులకు కన్నాలు పెట్టేశాయి, వాళ్ళ ఆహార పదార్థాలన్నీ తినేశాయి. రెండు గంటల లోపల శత్రు సైన్యం బిచ్చగాళ్ల సైన్యం అయిపోయింది. తమ పని పూర్తి



కాగానే ఎలుకలు ఆ పుల్లలమీదే తిరిగి నదిని దాటి తమ తమ ఇళ్ళకు వెళ్ళిపోయాయి.

మర్నాడు తెల్లవారి శత్రు సైనికులు నిద్రలు లేచి చూసుకుంటే వాళ్ళ ఆయుధాలూ, దుస్తులూ, ఆహార పదార్థాలూ, పక్కలూ, దుప్పట్లూ పూర్తిగా ధ్వంసమై ఉన్నాయి. శిబిరమంతా గగ్గోలెత్తి పోయింది. శత్రుసైనికులు హాహాకారాలు చేస్తున్న తరుణంలో ఎలుకరాజు దూత రాజుగారి దగ్గరకు వచ్చి, "మహారాజా, నీ శత్రువు మీద దెబ్బ తీయటానికి ఇదేసమయం," అని చెప్పింది.

రాజు ధ్వజమెత్తి తన సైన్యాన్ని తీసుకుని నదీతీరానికి రావటం చూడగానే శత్రు సైనికులు, "అమ్మ, బాబోయ్!" అని కాలి సత్తువ కొద్దీ శిబిరం విడిచిపోయారు.

మనరాజు, శత్రురాజుకు ఇలా కబురు చేశాడు: "ఈ సారికి మీ మీదికి మా ఎలుకలను మాత్రమే పంపాను. మరొకసారి మా పైకి వచ్చిన పక్షంలో మా ఆవులనూ. గొర్రెలనూ, కుక్కలనూ, పిల్లులనూ మీ పైకి పంపకం చేస్తాను. అప్పటికీ మీకు బుద్ధి రాకపోతే మా రాజ్యంలోని సింహ శరభ శార్దూలాలను పంపుతాను. అది కూడా చాలని పరిస్థితిలో నేను మా సైనికులతో సహా వచ్చి మీ సేనలను పూర్తిగా తుడిచి పెట్టేస్తాను!"

ఎలుకలతోనే ఇంత చేసినవాడితో వైరం తగదని శత్రురాజు మన రాజుపైకి దండెత్తే ఆలోచన పూర్తిగా మానేసుకున్నాడు.

ఈ విధంగా తననూ, తన రాజ్యాన్నీ కాపాడిన ఎలుకరాజు కోరికపై మనరాజు రెండు ఏర్పాట్లు చేశాడు. ఒకటి ఏమిటంటే, రాజ్యంలో ఎక్కడా పిల్లి అనేది లేకుండా చెయ్యటం; రెండవది, నది పొంగినప్పుడు ఎలుకల ఇళ్ళు మునిగిపోకుండా, నది పొడుగునా ఎత్తయిన గట్టు వేయించటం. ఈ రెండు ఏర్పాట్లూ ఇప్పటికి కూడా ఆ దేశంలో అమలులో ఉన్నాయి.





# పాతాళదుర్గం

## 17

[కాలశంబర మాంత్రికుడు, ధూమకుడూ వాళ్ళను కొండశిఖరం మీదికి తీసుకు పోయాడు. అక్కడ ఒక సరోవరతీరంలో రాకుమార్తె కాంతిసేన కనిపించింది. ఆమె పారిపోకుండా కాపలాకాస్తున్న కుంభీరుడు, మాంత్రికుడు అనుచరులతో ఆ ప్రాంతాలకు వచ్చినట్టు గ్రహించి, అతడున్న చోటుకు వేగంగా రాసాగాడు. తరవాత—]

కుంభీరుడు తామున్న ప్రదేశం కేసి వస్తున్నట్టు అనుమానం కలగ్గానే, ధూమకుడు చప్పున కత్తి దూసి, "మహామాంత్రికా! కుంభీరుడికి మన రహస్యం తెలిసిపోయింది. వాడిటే వస్తున్నాడు. ఇతర రాక్షసులకు హెచ్చరిక యివ్వకముందే వాణ్ణి యమలోకానికి పంపటం అవసరం," అన్నాడు.

మాంత్రికుడా మాటలకు నవ్వి, "ధూమకా, తొందరపడకు. కుంభీరుడు మనపక్షంలోని వాడే. వాడు రావణుడి పాలిటి విభీషణుడివంటివాడు. వంశద్రోహులే కాలంలోనూ వుంటూనే వుంటారు!" అన్నాడు.

కుంభీరుడు చెట్టు వద్దకు వచ్చి, దాని బోదెలో వున్న పెద్ద కంత దగ్గిరకు ఒక ఎండు మోడును లాక్కొని, దాని మీద కూర్చుంటూ, "శంబరా! రాక్షసులవి పెద్ద చేవులు, వాళ్ళ శ్రవణశక్తి గొప్పది. కొద్ది దినాలుగా నీవు నమ్మకద్రోహం చేయ



బోతున్నావన్న అనుమానం నన్ను బాధిస్తున్నది. నేను మహాకలి సోదరుణ్ణి కాను, అందువల్ల విభీషణుణ్ణి ఎలా అవుతాను? వంశద్రోహం మాట! మాది రాహువంశం, వాడిది కేతువంశం. కనక, యిక్కడ వంశద్రోహం ప్రసక్తే లేదు," అన్నాడు కోపంగా.

మాంత్రికు డతడి కేసి రెండడుగులు వేసి, చెట్టు బోదెనానుకుని నిలబడి, చిన్న గొంతుతో, "కొత్తగా వచ్చి చేరిన అనుచరులకు, నీ మీద విశ్వాసం కలిగేందుకు ఏవో కొన్ని చిన్న అబద్ధాలు చెపుతున్నాను, నువ్వు అపోహపడకు. వాళ్ళు నిన్ను ఎరిగిన వాళ్ళే. కదంబరాజ్య కొండగుహల వద్ద రాకుమారికి నీవు చేసిన వాగ్దానం వాళ్ళు వినివున్నారు కూడా," అన్నాడు.

ఆ మాట వింటూనే కుంభీరుడు చప్పున తలతిప్పి, ధూమక సోమకుల కేసి చూసి, "ప్రాణాలతో వీళ్ళింత దూరం వచ్చారా? ఈ నల్ల గరుడపక్షిగా డెవడు? ఈ ముఖం ఎక్కడో చూసినట్టున్నదే," అన్నాడు.

"చూసే వుంటావు. ఆటవిక నాయకుడు విరూపుడు," అన్నాడు కాలశంబర మాంత్రికుడు. విరూపుడూ, ధూమక సోమకులూ రాక్షసుడికి వంగి నమస్కారాలు చేశారు.

"ఇదేరకం వినయం?" అంటూ కుంభీరుడు కనుబొమలు చిట్లించి, "శంబరా! నేను నా వంశగౌరవం కాపాడేందుకు నీకు సహాయం చేస్తానన్నాను. నీవు నమ్మకద్రోహివిగా ప్రవర్తించవుగదా?" అన్నాడు.

"ఆ అనుమానం నీకెందుక్కలిగింది?" అని ప్రశ్నించాడు మాంత్రికుడు.

"నేను వేయి కళ్ళతో అంతా గమనిస్తూనే వున్నాను. కొండ కింది జలపాతంతో, కొండ మీది సరోవరంలో నీ అనుచరు లాడే ఆటలన్నీ నే నెరుగుదును. వాళ్ళ ప్రయత్నమేమిటి?" అన్నాడు కుంభీరుడు.

"అది పరమరహస్యం. ఇప్పు డప్పుడే వెల్లడించేది కాదు. కాని, ఒకటి చెపు



తున్నాను. నీకూ, నీ వంశం వాళ్ళయిన పాతిక మున్ఫైమంది రాక్షసులకూ ఎలాంటి ప్రమాదం రాకుండా చూసే బాధ్యత నాది," అన్నాడు కాలశంబరుడు.

కుంభీరుడు మారు మాటాడకుండా, అసంతృప్తి వ్యక్తమయే ధోరణిలో తలాడిస్తూ, చెట్టుబోదె దగ్గిర నుంచి సరోవర తీరానికి వెళ్ళిపోయాడు. మాంత్రికుడు బోదెలో వున్న కంతను ఎప్పటిలా మూసి, దీర్ఘాలోచనలో వున్నవాడిలా తల వంచుకుని వెనుదిరిగి కొంత దూరం నడిచి, "భద్రా! ఏర్పాట్లన్నీ సక్రమంగా జరిగి పోతున్నయ్యా? మరో రెండు గంటల్లో చీకటి పడబోతున్నది. భస్మాలూ అవీ వాటి వాటి స్థానాల్లో చేర్చాలి. రాక్షసుల వ్యావసాయ జంతువులు—పులులూ, సింహాలూ, ఏనుగుల మాటేమిటి? వాటికి యీ రాత్రి నుంచే ఉపవాసం ప్రారంభమవుతుంది గదా? కుంభీరుడి అనుచరులు వాటిని రేపు మధ్యాహ్నం వరకూ అదుపులో పెట్టి, వేటకు వదలగలరా?" అని అడిగాడు.

"అంతా సిద్ధం అవుతున్నది. ఎవరి స్థానాల్లో వాళ్ళు జాగరూకులుగా వున్నారు. ఓషధీ భస్మాలన్నీ, ఈ రాత్రికి పాతాళ దుర్గం చుట్టూవున్న మహావృక్షాల కొమ్మ

లెక్కబోతున్నవి. సాధువులైపోయిన సింహాలూ, ఏనుగులూ తిరిగి క్రూర మృగాలు కాబోతున్నవి. ఒక్క సరోవరం సంగతే మీరు చూడాలి. ఆ బండరాయి వుండవలసిన చోట, వుండవలసిన తీరుగా వున్నదీ లేనిదీ పరీక్షించటం మా వల్ల కాలేదు. మాలో మంత్రవిద్యలుగాని, జల స్తంభన విద్యగాని తెలిసిన వాడెవడూ లేడుగదా?" అన్నాడు భద్రుడు.

"ఆ బండరాతి జోలికి పోవద్దని లోగడే హెచ్చరించానుగదా? దాని విషయంలో చిన్నం యెత్తు పొరబాటు జరిగినా రాక్షసుల చావు అబద్ధం, మన చావు నిజం అవు





తుంది. చీకటిపడనివ్వండి, దాని సంగతి చూస్తాను," అన్నాడు మాంత్రికుడు.

ఆ తరవాత అందరూ కొండ గర్భంలోని తమ నివాసానికి బయలుదేరారు. వాళ్ళు పై నుంచి సొరంగాల్లోకివున్న మెట్లసోపానం దిగి వస్తూండగా, కొందరు మనుషులు మాంత్రికుడి దగ్గిరకు పరిగెత్తుకుంటూ వచ్చి, "మహామాంత్రికా! సొరంగం గోడల వెంట పైనుంచి నీరు సన్ననిధారలుగా కారుతున్నది. మన నివాసాలు నీట మునిగే ప్రమాదం లేదుకదా?" అన్నారు.

మాంత్రికుడు ఒక క్షణకాలం నివ్వెర పోయి, అంతలోనే తెప్పరిల్లి గబగబా మెట్లు దిగి సొరంగ నివాసాల్లో ప్రవేశించాడు. అక్కడ గోడల మీద నీటిచారికలు కనిపించినై. మాంత్రికుడు ఒక చిన్న పాత్ర తెప్పించి, అందులోకి ఆ నీటిని పట్టించి, తన అనుచరుల్లో ఒకణ్ణి తాగమన్నాడు.

"రుచెలా వున్నది? ఉప్పునీరా? తీపి నీరా?" అని ప్రశ్నించాడు మాంత్రికుడు.

"తియ్యగా వున్నది," అన్నాడు వాడు.

"తియ్యగా అంటే...మన జలపాతంలోని నీరులాగానా?" అన్నాడు మాంత్రికుడు. వాడు అవునన్నట్టు తలవూపాడు.

"మన కెలాంటి ప్రమాదం లేదు. అయినా ఒకరిద్దరు నీటిధారలు మరింత పెద్దవవుతవేమో గమనిస్తూ వుండండి," అంటూ మాంత్రికుడు భద్రుడి కేసి తిరిగి, "భద్రా! ఆ మోకులూ అవీ సిద్ధంగా వున్నవికదా? ఇంక కొంచెంసేపట్లో నేను సరోవరం దగ్గిరికి బయలుదేరబోతున్నాను. నా వెంట ధూమక సోమకుల్నీ, విరూపుణ్ణీ తీసుకుపోతాను. ఇక్కడి ఏర్పాట్లన్నీ చూసే బాధ్యత నీది," అన్నాడు.

సూర్యాస్తమయమై, కొండ మీద చీకట్లు అలముకొనగానే కాలశంబరుడు, ధూమక సోమకుల్నీ, విరూపుణ్ణీ తోడు తీసుకుని గుహల్లో నుంచి కొండ మీదికి వెళ్ళాడు.



అక్కడ ఒక చెట్టు కింద తీగలతో అల్లిన బలమైన పొడవాటి మోకులు చుట్టగా పడి వున్నవి. ధూమక సోమకులూ, విరూపుడూ వాటిని ఎత్తి భుజాల మీద వేసుకున్నారు. వాళ్ళకు అంతా గొడవగొడవగా వున్నది. భద్రుడూ, మాంత్రికుడూ జరిపిన సంభాషణలో ఒక్క ముక్కయినా వాళ్ళకు అర్థం కాలేదు. ఈ మోకులూ, సరోవరం, బండరాయి, జలస్తంభనం...అంతా అయోమయంగా వున్నది. ప్రశ్నిస్తే, అంతా పరమ రహస్యం అంటున్నాడు కాలశంబరుడు!

ఆకాశంలో మినుకు మినుకు మనే చుక్కల కాంతిలో నలుగురూ నిశ్శబ్దంగా నడిచి, కొండ మీది సరోవరాన్ని సమీపించారు. వాళ్ళు చేరిన ప్రాంతం, సాయంకాలంవేళ కుంభీరరాక్షసుడూ, రాకుమారి కాంతిసేనా విహరించి పోయిన ప్రదేశానికి ఒక పక్కగా, పాతాళదుర్గానికి కొంచెం దాపులగా వున్నది.

తీరం చేరగానే కాలశంబర మాంత్రికుడు నీటిలో మంత్రదండాన్ని సగం వరకూ ముంచి, ఏవో మంత్రాలు పఠిస్తూ చుట్టూ ఓమారు కలయచూశాడు. ఒడ్డున అనేకమైన మహావృక్షాలు గాలితాకిడికి కదుల్లాడుతూ, కొమ్మలు ఒకదాని కొకటి ఒరుసు




కోగా కిర్రు గిర్రుమంటూ వికృతంగా ధ్వనులు చేస్తున్నవి.

మాంత్రికుడు మంత్రదండం పైకెత్తి ఆ మహావృక్షాల్లో ఒకదానిని ధూమక సోమకులకు చూపుతూ, "మోకు ఒక కొసను ఆ చెట్టు కాండానికి కట్టి, రెండవ కొస నా చేతి కివ్వండి. నేను సరోవరంలో ప్రవేశించబోతున్నాను. ఎంతసేపటికి తిరిగి వస్తానో చెప్పలేను. మీరు మాత్రం నిశ్శబ్దంగా యిక్కడే కూర్చోండి," అని చెప్పి, ధూమకు డిచ్చిన మోకును అందుకుని, "శాంభవీ!" అంటూ చిన్నగా అరిచి దభాలున నీటిలోకి దూకాడు.



ధూమక సోమకులూ, విరూపుడూ నిశ్శబ్దంగా కూర్చున్నారు. ఒక గంటకాలం గడిచింది. చెట్టు కొమ్మల్లో గుడ్లగూబ ఒకటి కర్ణకఠోరంగా అరిచింది. విరూపుడి భుజాన అప్పటివరకూ కునికిపాట్లు పడు తున్న నల్ల గరుడపక్షి ఆ అరుపు వింటూనే చప్పున తల ఎత్తి రెక్కలల్లల్లాడిస్తూ కీ అంటూ కేకపెట్టింది. అంతలో ఒక పెద్ద గబ్బిలం దాని తల మీద బలంగా తన్ని, వేగంగా మానుకొమ్మల్లోకి ఎగిరిపోయింది. గరుడపక్షి రెచ్చిపోయి విరూపుడి భుజం మీంచి కిందికి దూకి, కాళ్ళతో నేలను గీరుతూ కీచుమంటూ అరిచి పై కెగర బోయింది. ధూమకుడు ముందుకు వంగి పక్షికాలున వేలాడుతున్న తాడును గట్టిగా పట్టుకుని, "విరూపా! దీన్ని పారి పోకుండా పట్టుకో. దీనితో అవసరం రావొచ్చు," అన్నాడు.

"పారిపోకుండా పట్టుకోవటమా! యిది నన్నొదిలి ఎక్కడికి పోతుంది?" అంటూ విరూపుడు నల్లగరుడపక్షిని రెండు చేతులతో పట్టుకుని ఎత్తి భుజాన పెట్టుకుంటూ, "మాంత్రికదొర యింతసేపైనా నీట్లో నుంచి బయిటికి రాలేదేం?" అన్నాడు.

"అదే నేనూ ఆలోచిస్తున్నాను. ఎంత జలస్తంభన విద్య తెలిసిన వాడైనా నీటి అడుగున యింతసేపుండగలడా? అతడి కేదైనా ముప్పు జరిగివుంటే, మనం అంతా రాక్షసుల చేతుల్లో హతం అయిపోతాం," అన్నాడు ధూమకుడు నిస్పృహగా.

వాళ్ళిలా మాట్లాడుకుంటూండగా కొంద దిగువ పాతాళదుర్గప్రాంతం నుంచి వాద్యాల మోతా, రాక్షసులు కాల్చే తారాజువ్వల వెలుగూ ధూమకుడూ వాళ్ళకు కనిపించింది.

"వాళ్ళప్పుడే జాతర ప్రారంభించారు," అన్నాడు విరూపుడు.

"అలాగే వున్నది. రేపు మధ్యాహ్నం వేళకుగదా, శశికాంతుణ్ణి వాళ్ళు శిరశ్ఛేదం

చేయబోయేది. అతణ్ణీ, కాంతి సేననూ ఆ దుర్మార్గుల బారి నుంచి మాంత్రికు డెలా కాపాడగలడో నా కర్థంకావటంలేదు. మనం వుండే కొండగర్భంలోని రహస్యసొరంగాలు తెలుసుకుని, వాళ్ళే ముందుగా మనను హతమార్చవచ్చు. కుంభీరుడిలో నాకు నమ్మకం లేదు," అన్నాడు సోమకుడు.

"ఏంజరగటానికైనా అవకాశం వున్నది. మరోక్షణంలో మాంత్రికుడి శవం నీటి మీద తేలినా నేనాశ్చర్యపడను," అన్నాడు ధూమకుడు.

అతడు మాట ముగించీ ముగించక ముందే సరోవరంలో చిన్న అలలు లేచినై. మరుక్షణం కాలశంబర మాంత్రికుడు ఒక చేత్తో మంత్రదండం, మరొక చేత్తో బంగారంలా మిలమిలా మెరిసిపోతున్న చిన్న మొసలి పిల్లనూ పట్టుకుని నీటి మీదికి తేలి, ఒడ్డు కేసి వచ్చాడు. ధూమకుడూ వాళ్ళు ఉత్సాహంగా లేచి అతడి కేసి పరిగెత్తారు.

మాంత్రికుడు చిరునవ్వు నవ్వుతూ వాళ్ళకు మొసలిపిల్లను చూపి, "ఇది గొప్ప శుభ సూచకం. బంగారు మొసళ్ళను మీరెక్కడా చూసివుండరు. ఇది కావాలని నాకు దొరికింది. దీన్నీ, నల్ల గరుడపక్షినీ ప్రయోగించి రేపు ఒక గొప్ప ఘనకార్యం సాధించబోతున్నాం," అన్నాడు.

ధూమకుడూ అతడి అనుచరులు బంగారు మొసలిపిల్ల కేసి చూస్తూ అద్భుత పడ్డారు. మాంత్రికుడు కొండ కింద రేగిన గందరగోళ ధ్వనులు ఒక తృటికాలం విని, "ఓహో, మహాకలిరాక్షసుడి పైతృకపర్వంతికి ముహూర్తం సమీపించిందన్నమాట! జై, శాంభవీ!" అంటూ చేతులు రెండూ పైకెత్తి, "ఆ మోకులు చెట్టుబోదెకు గట్టిగా బిగించారు గదా? మహాకలి కాలశంబరుల మధ్య చావుబతుకుల యుద్ధం ప్రారంభమైంది," అంటూ తన రహస్యనివాసం కేసి బయలుదేరాడు. —(ఇంకా వుంది)






# పతివ్రత

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, నిన్నింత కఠిన శ్రమకు గురిచేసిన వారిపట్ల నీకు ఆగ్రహమైనా కలగక పోవటం చూస్తే సుందరవదనుడి కథ జ్ఞాపకం వస్తున్నది. శ్రమతెలియకుండా ఉండగలందులకు నీకు అతడి కథ చెబుతాను విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు:

పూర్వం కామరూప దేశంలో బ్రహ్మపుత్రా నదీతీరాన కామాఖ్య నగరంలో ఇద్దరు మిత్రు లుండేవారు. ఒకడి పేరు గంగాపుత్రుడు. రెండవవాడు సుమిత్రుడు. గంగాపుత్రుడు గొప్ప వంశానికి చెందినవాడు. అతని తాత ముత్తాతలు మంత్రులుగానూ, సేనాపతులుగానూ పనిచేసి బోలె

## బేతాళ కథలు



డంత ఆస్తి కూడబెట్టినవాళ్ళు. ఆ ఆస్తి మీదనే గంగాపుత్రుడు సుఖజీవనం చేస్తున్నాడు. సుమిత్రుడు అంత గొప్ప వంశానికి చెందినవాడూ కాడు, అంత ఆస్తిపరుడూ కాడు. అతను తనకు నగరంలో ఉన్న ఇల్లూ, దొడ్డీ అమ్మి ఒక పడవ కొనుక్కొని, దాన్ని నగరంలోని వర్తకులకు కిరాయికి నడుపుతూ, తన భార్యతో సహా అందులోనే కాపరం చేస్తున్నాడు. అతనికి కూడా జరుగుబాటు బాగానే ఉన్నది.

అతను తన పడవను నగరపు రేవుకు తెచ్చినప్పుడల్లా తప్పక గంగాపుత్రుణ్ణి చూడవచ్చేవాడు.

ఈ ఇద్దరు మిత్రులూ నలభై ఏళ్ళ వయసు వాళ్ళయినప్పటికీ ఇద్దరికీ పిల్లలు కలగలేదు.

ఒకనాడు సుమిత్రుడు గంగాపుత్రుణ్ణి చూడవచ్చి, "ఏమోయ్, మన నగరం వెలుపల వెలిసిన సంతానదేవికి మొక్కుకున్న వారికి పిల్లలు కలుగుతున్నారుట. నేను పోతున్నాను. నువు కూడా వస్తావా?" అని అడిగాడు. రాసి ఉంటే పిల్లలు వాళ్ళే పుడతారన్న నిశ్చింతలో ఉండి కూడా, గంగాపుత్రుడు సుమిత్రుడి వెంట వెళ్ళి, సంతానదేవి ఆలయంలో పూజా, నైవేద్యాలు జరిపించి, తన మిత్రుణ్ణి పడవ వద్ద దిగబెట్టి ఇంటికి తిరిగి వచ్చాడు.

ఇది జరిగిన ఏడాది లోపల గంగాపుత్రుడికి అతి చక్కని కుమారుడు కలిగాడు. ఆ తరవాత కొద్ది రోజులకు సుమిత్రుడికి ఒక కూతురు పుట్టింది. గంగాపుత్రుడి కొడుక్కు సుందరవదనుడనీ, సుమిత్రుడి కుమార్తెకు యశోవతి అనీ పేరు పెట్టుకుని, పెద్దయాక వాళ్ళిద్దరికీ పెళ్ళి జరగాలని లాంఛనంగా అనుకుంటూ ఉండేవాళ్ళు.

సుందరవదనుడు ఆరేళ్ళవాడై ఉండగా అతనికి కష్టకాలం ఆరంభమయింది. ముందు గంగాపుత్రుడు చనిపోయాడు.

తరవాత కాటకం వచ్చింది. గంగాపుత్రుడి భార్య ఆడది కావటంలో ఆస్తి చూసు కోవటం ఆమెకు చాతకాలేదు. అధికార్లు ఆమె వద్ద పన్నులు తెగవసూలు చేశారు. పొలాలు చేసేవాళ్ళు మోసగించారు. ఈ బాధలకు తట్టుకోలేక ఆమె ఇల్లూ, పొలాలూ అమ్మి డబ్బు చేర్చి, ఎక్కడో ఒక ఇల్లు అద్దెకు తీసుకుని, పేదగా జీవిస్తూ, ఆ డబ్బు తోనే పదేళ్ళ పాటు జీవితాన్ని ఈడ్చు కొచ్చింది. అప్పటికి డబ్బంతా అయిపోయి, కటిక దరిద్రం వచ్చింది. ఆ సమయంలో ఆమెకు జబ్బుచేసి, మందుకైనా దిక్కు లేని చావు చచ్చింది.

తల్లి పోయాక సుందరవదనుడు ఇల్లు కూడా లేక కట్టు బట్టలతో మిగిలాడు. అతనికి చదువున్నది గనక ఒక వర్తకుడు చేరదీసి అతనిచేత పద్దులు రాయించుకో నారంభించాడు. అయితే ఆ వర్తకుడు తనను హీనంగా చూడటం సుందరవదనుడు సహించలేక పోయాడు. అతను పుట్టినది మంచి వంశం కావటంచేత అతనికి దాస్య బుద్ధి అలవడలేదు. అతను తన ఉద్యోగం మానేసి బిచ్చమెత్తుకుని పొట్ట పోసుకుంటూ, ఏ గుడిలోనో పడుకుంటూ వచ్చాడు. బిచ్చ మెత్తటంలో కూడా అతని రాజసం కని



పిస్తూనే ఉండేది. ఇచ్చేవాళ్ళను అదే పనిగా వెంట తరిమి వేధించేవాడు కాడు; వాళ్ళు ఇష్టపడి ఇచ్చినది తీసుకుని వెళ్ళి పోయేవాడు.

శీతకాలపు వానలు ఆరంభమయాయి. ఆకలి దహించుకు పోతున్నది. సుందర వదనుడు చలినీ, వాననూ లక్ష్యపెట్టక అడుక్కోవటానికి గుడి నుంచి బయలు దేరాడు. అతను నాలుగడుగులు వేశాడో లేదో, ఎదురు వస్తూ సుమిత్రుడు కని పించాడు. సుందరవదనుడు ఆయనను చూడనట్టు తల వంచుకుని గబగబా ముందుకుసాగాడు.

కాని సుమిత్రుడు అతన్ని రెక్క పట్టుకుని ఆపి, "సుందరవదనుడివి కాదుట్రా? ఇలా అయిపోయావేం?" అని అడిగాడు. గంగాపుత్రుడు పోయాక సుమిత్రుడు వారి ఇంటి కేసి రాకపోవటంచేత ఆయన కేమీ తెలియదు.

"ఈ స్థితిలో నిన్ను పలకరించటానికి సిగ్గయింది, మామా," అంటూ సుందరవదనుడు తన పరిస్థితి అంతా సుమిత్రుడికి వివరించి చెప్పాడు.

"అరెరే, ఎంత పని జరిగిందీ! నువ్వు వచ్చి నా పడవలో ఉండి పని చేశావంటే నీకు అన్నవస్త్రాలకు లోటు లేకుండా చూస్తాను," అన్నాడు సుమిత్రుడు. ఇందుకు సుందరవదనుడు ఒప్పుకున్నాడు. ఇద్దరూ కలిసి పడవ మీదికి వెళ్ళారు. సుమిత్రుడు సుందరవదనుణ్ణి తన భార్యకు చూపి, అంతా చెప్పి, "వాడికి ముందు కాస్త అన్నం పెట్టు," అన్నాడు.

"అన్నమైతే ఉందిగాని చద్ది అన్నం," అన్నది సుమిత్రుడి భార్య.

"అయితే అయిందిలే, ఇంత ఊరగాయ వేసిపెట్టు," అన్నాడు భర్త.

ఆకలి మీద ఉన్న సుందరవదనుడు ఆ చద్దిముద్ద ఊరగాయతో తింటుండగా మళ్ళీ జల్లు ఆరంభమయింది.



"వెనక గదిలో పాత కుళాయి ఒకటి ఉండాలి, మనవాడికి తెచ్చిపెట్టు తల్లీ," అని సుమిత్రుడు, పడవ గదిలో వున్న తన కూతుర్ని కేక పెట్టాడు.

యశోవతి ఆ కుళాయి తీసి, అది ఒకపక్క చినిగి ఉండటం గమనించి, సూదితో గబ గబా కుట్టి, తెచ్చి సుందరవదనుడి కిచ్చింది.

ఆ తరవాత సుమిత్రుడు తన పని మీద నగరంలోకి వెళ్ళి, వర్తకులతో మాట్లాడి, సాయంకాలానికే పడవ చేరుకున్నాడు. మర్నాడు ఆయన నిద్రలేచి పడవ పైభాగా నికి వచ్చేసరికి సుందరవదనుడు వెనక భాగంలో ఊరికే కూర్చుని కనిపించాడు.

"ఒరేయ్, మా దగ్గిర తిండీ బట్టా పుచ్చుకుంటున్న వాడివి గదా, అలా ఒళ్ళు మీదుగట్టుకు కూర్చోకపోతే ఇంత నార తీసుకుని తాడైనా పేనరాదూ—ఇంకే పనీ లేకపోతే?" అన్నాడు సుమిత్రుడు.

"అలాగే పేనుతాను," అన్నాడు సుందరవదనుడు. ఇది జరిగాక అతను ఎన్నడూ ఊరికే ఉండలేదు; ఏదో ఒక పని కల్పించుకుని తెల్లవారినది మొదలు బాగా చీకటిపడినదాకా ఎంతో శ్రమపడి పనిచేస్తూ వచ్చాడు.

ముఖ్యంగా సుందరవదనుడు పద్దులు రాయటంలోనూ, లెక్కలు కట్టటంలోనూ





చాలా గట్టివాడు. మిగిలిన పడవల యజమానులు కూడా అతని సహాయం పొందుతూ, అతన్ని గౌరవంగా చూసేవారు. కష్టాలు గట్టెక్కటంతో అతను కాస్త ఒళ్ళు చేసి, నవనవలాడుతూ, మరింత ఆకర్షణీయంగా తయారయాడు.

సుమిత్రుడికీ, అతని భార్యకూ కూడా తమ కుమార్తె యశోవతికి సుందరవదనుడి కన్న మంచి భర్త దొరకడన్న అభిప్రాయం ఒకేసారి కలిగింది. సుమిత్రుడు తన భార్యతో సంప్రతించి, "మా అమ్మాయిని నీ కిచ్చి చేద్దామనుకుంటున్నాం. ఏమంటావు?" అని సుందరవదనుణ్ణి అడిగాడు.

"నేను యశోవతికి తగను," అన్నాడు సుందరవదనుడు. కాని సుమిత్రుడికి ఈ ఉద్దేశం బలంగానే ఉన్నదని తెలిశాక, ఒప్పుకున్నాడు. వాళ్ళిద్దరి పెళ్ళి కామాఖ్య నగరంలోనే చాలా వైభవంగా జరిగింది. భార్యాభర్తలు చాలా అన్యోన్యంగా ఉండేవారు. మరసటి ఏడే వాళ్ళకొక ఆడపిల్ల కూడా కలిగింది. ఆ బిడ్డకు ఏడాది నిండగానే అమ్మవారు పోసి, ఎన్ని మందు ఇచ్చినా ఫలితంలేక, చనిపోయింది.

ఆ పిల్ల పోయినది మొదలు సుందరవదనుడు మానసికంగా కుంగిపోయి, క్షయ వ్యాధి తెచ్చుకున్నాడు. అన్నహితవు పోయింది. మనిషి చిక్కి శల్యంలాగా అయిపోయి, కూర్చుని లేవలేని స్థితికి వచ్చాడు. సుమిత్రుడు తనకు సాధ్యమైన మట్టుకు మందు ఇప్పించాడు, భూత వైద్యం చేయించి, రక్షరేఖలు కట్టించాడు, కాని ఏమీ ప్రయోజనం లేకపోయింది. సంవత్సరాని కల్లా అతను జీవచ్ఛవంలాగా అయాడు. అతని అత్తమామలు అతని చావు కోసం ఎదురు చూడసాగారు. ఎందుకంటే తమ కుమార్తె ఈ జీవచ్ఛవంతో కాపరం చెయ్యటం వారి కిష్టంలేదు. యశోవతి ఇంకా చిన్నపిల్ల. ఈ మొగుడుపోతే

తిరిగి పెళ్ళాడవచ్చు. మారుమనువు వాళ్ళలో పరిపాటే.

కాని వాళ్ళ కోరిక నెరవేరలేదు, సుందర వదనుడు చావలేదు.

సుమిత్రుడు తన భార్యతో, "ముసలి తనంలో మన చేతికి అందివస్తాడనుకుంటే ఈ దౌర్భాగ్యుడు, చూడు, మనపిల్ల మెడకు ఎలా గుదిబండ అయి కూర్చున్నాడో! పిల్ల దాని యౌవనం భ్రష్టయిపోతున్నది. వీణ్ణి ఎలాగైనా వదిలించుకుని దానికి మరో మొగుణ్ణి చూడవలిసిందే," అన్నాడు. భార్య కూడా సరే నన్నది. వాళ్ళు యశో వతికి మాత్రం ఈ ఆలోచన చెప్పలేదు.

సుమిత్రుడు తన పడవను ప్రవాహానికి ఎదురు నడుపుకుని వెళ్ళి, ఒక నిర్జనమైన ప్రాంతానికి చేర్చి, కావాలని ఒడ్డుకు గుచ్చాడు. తరవాత ఆయన సుందరవద నుడితో, "అలా చూస్తూ కూర్చుంటావేం? దిగి పడవను ఒక తోపుతొయ్యి," అన్నాడు.

"నా కంత శక్తి ఎక్కడున్నది?" అన్నాడు సుందరవదనుడు.

"ఎక్కడ దాపరించావురా క్షయాపాత్తూ! పడవ తొయ్యకపోతే గొడ్డలీ, తాళ్ళూ తీసు కుని ఒడ్డుకుపోయి కట్టెలన్నా కొట్టుకురా!" అన్నాడు సుమిత్రుడు.




సుందరవదనుడు చిన్న గొడ్డలీ, తాళ్ళూ తీసుకుని ఒడ్డుకు దిగాడు. ఆ ప్రాంత మంతా ఎడారి లాగున్నది. చుట్టూ కొండ లున్నాయి. తీరానికి కొంత దూరంలో అడవి ఉన్నది. అతను కాళ్ళీడ్చుకుంటూ ఆ అడవిలోకి వెళ్ళాడు. అతనిలో కట్టెలు కొట్టే శక్తి కూడా లేదు. అందుచేత నేల మీద పడి ఉన్న ఎండు కొమ్మలన్నీ పోగు చేసి, తాడుతో మోపు కట్టాడు. దాన్ని ఎత్తి నెత్తిన పెట్టుకోవటం సాధ్యం కాలేదు. అందుచేత ఆ మోపు కొక తాడు కట్టి, గొడ్డలి తీసుకుని, మోపును ఈడ్చుకుంటూ నదీతీరానికి వచ్చాడు.



కాని అక్కడ పడవ లేదు. అది నది వాలున అప్పటికే చాలా దూరం వెళ్లి పోయింది. మామగారు తనను వదిలించు కున్నాడని అతను గ్రహించి, నది ఒడ్డున కూర్చుని, వెక్కి వెక్కి చాలాసేపు ఏడిచి, సొమ్మసిల్లి పడిపోయాడు.

అతనికి తిరిగి ఒళ్ళు తెలిసేసరికి ఎవరో మునిలాటివాడు సమీపంలో నిలబడి, "ఇది చాలా అపాయకరమైన చోటు. ఇక్కడ ఉండరాదు," అన్నాడు.

"నే నెక్కడికీ పోలేను. దయ ఉంచి నా ప్రాణాలు కాపాడండి," అని సుందర వదను డా మునిని వేడుకున్నాడు.

"ఈ రాత్రికి నా కుటీరంలో ఉండు. రేపటి మాట చూద్దాం," అంటూ ముని అతన్ని ఆ సమీపంలోనే ఉన్న తన కుటీ రానికి తీసుకుపోయాడు. అక్కడ సుందర వదనుడు జరిగినదంతా చెప్పాడు.

"నీది నిజానికి మనోవ్యాధి. మందులు పనిచెయ్యవు. నీకు బుద్ధదేవుడి వజ్రపాణి ధారణి మంత్రం ఉపదేశిస్తాను. దాన్ని రోజుకు ఒక్కసారి పఠించావంటే, హీనమైన కోరికలు నశించి, నీ ఆరోగ్యం కుదటపడి, నీ కెంతో మేలు కలుగుతుంది," అన్నాడు.

వజ్రపాణిధారణి సూత్రాన్ని ఒక్కసారి ముని నోట వినగానే సుందరవదనుడికి,



నేర్చుకుని మరిచిపోయిన పాతదానిలాగా, పూర్తిగా వచ్చేసింది.

అతను ఆ రాత్రి ఆ ముని ఆశ్రమంలోనే నిద్రపోయి మర్నాడు లేచేసరికి, మునిగాని, ఆశ్రమం గాని లేదు. అతను నది ఒడ్డునే ఉన్నాడు. అతను నదిలో ముఖమూ, కాళ్లూ కడుక్కుని బౌద్ధసూత్రం పఠించి, ఎక్కడికీ వెళ్ళటానికి తోచక, తిరిగి అరణ్యం కేసే వెళ్ళాడు. అరణ్యంలో కొంతదూరం పోగానే చెట్ల మధ్యన ఏదో ఇల్లు కనిపించింది. ఆకలి బాధ తీర్చుకోవటానికి భిక్షపొందుదా మనుకుని అత నా ఇంటి కేసి వెళ్ళాడు.

అతను చూసినది ఇల్లు కాదు—ఒక పాడుబడిన దేవాలయం. అందులో చెట్ల కొమ్మలు కప్పి ఎనిమిది పెద్ద పెట్టె లున్నాయి. ఎవరో దొంగలు ఆ పెట్టెలలో తాము దొంగిలించిన సొమ్ము దాచి ఉంటారనీ, దాన్ని తాను తీసుకోవటంలో తప్పేమీ ఉండదనీ అతననుకున్నాడు.

అతను తిరిగి నదీతీరానికి వచ్చాడు. అదృష్టవశాన ఒక పెద్ద పడవ అటుగా వస్తున్నది. అతనా పడవను పిలిచి, పడవ వాళ్ళతో, "మాది శ్రీకంఠనగరం. నా పేరు శ్రీవత్సుడు. నేనూ, మా పెత్తండ్రీ వ్యాపారం నిమిత్తం పడమట పోతూండగా






దొంగలు మమ్మల్ని దోచి, మా పెత్తండ్రిని చంపేశారు. నే నాయన పరిచారకుణ్ణని చెప్పి ప్రాణాలతో బయటపడ్డాను. అదీ గాక నేను జబ్బుపడి ఉండటంచేత వాళ్ళు నన్ను చంపలేదు. దొంగలు మా సొత్తంతా తీసుకుపోయి అడవిలో ఒక పాడుబడిన గుడిలో పెట్టి, నన్ను కూడా అక్కడే ఉంచి, నాకూ మా పెట్టెలకూ ఒక దొంగను కాపుంచి, మిగిలినవాళ్ళు ఇంకెక్కడో దొంగతనం చెయ్యటానికి వెళ్ళారు. నిన్న రాత్రి పాము కరిచి, నాకు కాపలా ఉన్న దొంగ కాస్తా చచ్చాడు. నే నిలా తప్పించుకుని వచ్చాను. నన్ను పడవలో ఎక్కనిస్తారా?" అన్నాడు.

పడవవాళ్లు సుందరవదనుణ్ణి అనుమానించినట్టుగా కనపడ్డారు.

"ఆ పాడుబడిన గుడిలో మావి ఎనిమిది పెట్టెలున్నాయి. అందులో ఒకటి మీ కిచ్చేస్తాను. మీరు నాతో కూడా వచ్చి ఆ పెట్టెలను చేరవెయ్యండి. త్వరగా మనం ఈ పని చెయ్యకపోతే దొంగలు తిరిగి రావచ్చు. ఆ తరవాత నాకూ మీకూ కూడా నష్టమే," అన్నా డతను.

పెట్టెల మాట వినగానే పడవ వాళ్ళకు ఉత్సాహం వచ్చింది. వాళ్ళు అతి శీఘ్రంగా అతని వెంట వెళ్లి ఎనిమిది పెట్టెలూ తెచ్చి పడవలో పెట్టారు. పడవ వాళ్ళ వంతుకు వచ్చిన పెట్టె నిండా రత్నాభరణాలూ, బంగారమూ ఉన్నాయి. వాళ్ళ ఆనందానికి మేర లేదు.

"తమ రెక్కడికి పోతారు, బాబుగారూ?" అని పడవవాళ్ళు అడిగితే సుందరవదనుడు తేజపురానికి పోతానన్నాడు.

అతను తేజపురంలో పడవ దిగి తన పెట్టెలతో సహా నగరంలో ఒక బాడుగ ఇంటికిపోయి, ఒక కమ్మరి సహాయంతో ఆ పెట్టెలకు వేసిన బద్దీలు పగలగొట్టించాడు. వాటిలో ఉన్న నిధి ఒకనాటిది కాదు. దొంగలు అనేక తరాలుగా దాన్ని

పోగుచేసినట్టు కనబడింది. అతను, ఎవరికీ అనుమానం కలగకుండా, ఆ నిధిని కొంచెం కొంచెంగా అమ్మి సొమ్ముచేసి, నగరం మధ్యలో ఒక దివ్యమైన భవనమూ, నగరం వెలపల పొలాలూ, తోటలూ కొని, నౌకర్లనూ, చాకర్లనూ ఏర్పాటు చేసుకుని రాజవైభోగంతో జీవించసాగాడు. త్వరలోనే శ్రీవత్సుడి పేరు తేజపురమంతటా మారు మోగింది. మనిషికి ఉన్నదే పుష్టి అన్నట్టు, అతని జబ్బంతా త్వరలోనే పోయింది. అతను తిరిగి నవనవలాడుతూ పూర్వంలాగా తయారయాడు.

ఈలోపల సుమిత్రుడి పడవ సుందర వదనుణ్ణి వదిలేసి, నది వాలున ముప్ఫై మైళ్ళు పోయేసరికి యశోవతి తన గదిలో నుంచి పడవ పైకి మందు తెచ్చి తన భర్త కోసం చూసి, "ఆయన ఎక్కడ?" అని తల్లి నడిగింది.

తల్లి ఆమె చేతిలో నుంచి మందు లాగేసి నదిలోకి గిరవాటు వేసి, "ఆయన పీడ విరగడై పోయిందిలే," అన్నది.

జరిగిన సంగతి తల్లి నుంచి విని యశో వతి ఏడుస్తూ కేకలుపెట్టి, పడవను వెనక్కు తిప్పమన్నది. తండ్రి వచ్చి, "తల్లీ, ఆ జీవ చ్ఛవంతో నీ కింకేం పని? వాడు చచ్చాడే




అనుకో! నువు హాయిగా మరొకణ్ణి పెళ్ళి చేసుకో," అన్నాడు.

"మీరు మనుషులు కారు, పిశాచాలు ముందు పడవ నక్కడికి తీసుకుపోయి ఆయన్ను తీసుకురండి. లేదా నన్ను కూడా చంపెయ్యండి," అని యశోవతి ఆక్రోశిం చింది. విధిలేక సుమిత్రుడు పడవను వెనక్కు తిప్పాడు. కాని ఆ నిర్జనప్రదేశంలో సుందరవదనుడు లేడు. నది ఒడ్డున గొడ్డలీ, కట్టెలమోపూ ఉన్నాయి.

"ఆయన హతాశుడై నదిలో దూకి ఉండాలి. నేనూ అలాగే ఆయనను చేరు కుంటాను," అని యశోవతి నదిలోకి ఉరక

బోయింది. తల్లీ, తండ్రీ ఆమెను బల వంతాన పట్టి ఆపారు.

ఆరు మాసాలపాటు యశోవతి తన భర్త కోసం కంటికీ మంటికీ ఏకధారగా ఏడి చింది. చనిపోయిన భర్తపేర తండ్రి పిండ ప్రదానం చేశాక ఆమె ఏడవటం మానేసి వైధవ్యవ్రతం అవలంబించింది. ఆమె ఏడుపు మానటం చూసి తల్లిదండ్రులు ఆమెను పెళ్ళాడమన్నారు. ఆ మాట వింటూనే ఆమె తిరిగి ఏడవ నారంభించి నదిలో దూకబోయింది. ఆ తరవాత వాళ్ళు తమ కూతురి ముందు పెళ్ళిమాట ఎత్తటం మానేశారు.

రెండేళ్ళు గడిచాయి. సుందరవదనుడు తన కొత్త జీవితాన్ని సుస్థిరం చేసుకుని తన అత్తమామలను చూడ సంకల్పించాడు. అతను బోలెడంత డబ్బూ, నౌకర్లనూ వెంట తీసుకుని, ఒక పడవ బాడుగకు తీసుకుని అందులో ప్రయాణమై కామాఖ్యకు వచ్చాడు. అక్కడికి వెళ్ళి విచారించగా సుమిత్రుడి పడవ ఇంకా దిగువన మరొక నగరానికి వెళ్ళి ఉన్నట్టు తెలిసింది. సుందరవదనుడు ఆ నగరం చేరి, అక్కడ బస ఏర్పాటు చేసుకుని, మర్నాడు ఉదయం రేవులోకి వచ్చి, సుమిత్రుడి పడవ కోసం వెతుకుతూ, ఆ పడవ మీద



వితంతులక్షణాలతో కనిపించిన యశోవతిని దూరం నుంచే చూశాడు.

వెంటనే అతను తన బసకు తిరిగిపోయి, ఒక పెళ్ళిళ్ళ పేరయ్యను పిలిపించి, "ఫలానివారి పడవలో ఒక వితంతువును చూశాను. ఆ పిల్లను పెళ్ళాడాలని ఉన్నది. పెళ్ళికి ఒప్పుకునే పక్షంలో పిల్ల తండ్రికి మూడువేల తులాల వెండి ఇచ్చుకుంటాను. ఈ పెళ్ళి కుదిర్చావంటే నీకో వంద తులాల వెండి ఇస్తాను," అన్నాడు.

ఆ పెళ్లిళ్ళ పేరయ్య శీఘ్రమే వెళ్ళి సుమిత్రుణ్ణి కలుసుకుని, "ఎవరో శ్రీవత్సుడుట. తేజపురంలో ఉండే కోటీశ్వరుడు. మీ అమ్మాయిని చూశాడట. పెళ్ళాడ గోరుతున్నాడు. వధువు తండ్రికి మూడువేల తులాల వెండి ఇస్తానంటున్నాడు. నువు సరే ననటమే వ్యవధానం," అన్నాడు.

"బాబూ, నీకు పుణ్యం ఉంటుంది. మమ్మల్ని ఇలా బతకనీ. పెళ్ళి అనే మాట వింటే నా కూతురు ఆత్మహత్య చేసుకుంటుంది!" అన్నాడు సుమిత్రుడు.

పెళ్లిళ్ళ పేరయ్య సుందరవదనుడి దగ్గిరికి తిరిగి వచ్చి, "అయ్యా, తమ రీ ఆలోచన మానుకోవచ్చు. ఆ పిల్ల వితంతువుగానే ఉండిపోతుంది గాని, మళ్లీ పెళ్ళాడదుట," అని చెప్పాడు.





"సరే పోనీ. దాని కేం గాని, ఆయన పడవ నాకు రెండు రోజులపాటు కిరాయి కిస్తాడేమో కనుక్కో!" అన్నాడు సుందర వదనుడు.

"ఎందు కివ్వడండీ? ఆయన వృత్తే అదిగా?" అన్నాడు పెళ్లిళ్ళ పేరయ్య. ఆయన మళ్ళీ సుమిత్రుడి వద్దకు వెళ్లి, "ఆ శ్రీవత్సుడుగారు నీ పడవను రెండు రోజులపాటు బాడుగకు కావాలని అడుగు తున్నాడు," అన్నాడు.

"తీసుకోమను," అన్నాడు సుమిత్రుడు.

ఈ మాట చెప్పవచ్చిన పెళ్లిళ్ళ పేరయ్య చేతిలో నూరు తులాల వెండి పెట్టి, సుందరవదనుడు నలుగురు నౌకర్లతో సహా తన మామగారి పడవ మీదికి వచ్చాడు. అతని జరీదుస్తులూ, వాలకమూ చూసి, సుమిత్రుడు గాని అతని భార్యగాని అతన్ని పోల్చుకోలేదు. యశోవతి మాత్రం ఒక క్షణంపాటు అతన్ని చూసి, అతనిలో తన భర్త కవళికలు గమనించి నిర్ఘాంత పోయింది.

ఆ వచ్చిన పెద్దమనిషి తానున్న గది కేసి చూసి, "ఆకలిగా వున్నది. చద్దన్నమైనా ఫరవాలేదు. ఇంత ఊరగాయతో తింటాను," అన్న మాటలు వినిపించి ఆమె ఆశ్చర్యం రెట్టింపయింది.

మరు క్షణమే ఆ పెద్దమనిషి తన నౌకరు కేసి తిరిగి, "ఒరేయ్, నా దగ్గిర తిండీ, బట్టా పుచ్చుకుంటున్నవాడివి గదా, అలా ఒళ్లు మీదుగట్టుకు కూర్చోక పోతే ఇంత నార తీసుకుని తాడైనా పేనరాదూ—ఇంకే పనీ లేకపోతే!" అన్నాడు.

తరవాత అతను సుమిత్రుడి కేసి తిరిగి, "మీ గదిలో ఒక చినిగిన కుళాయి ఉన్నది. దాన్ని నాకు అరువిస్తారా?" అనటం కూడా యశోవతి విన్నది.

ఈ మాటలన్నీ సుమిత్రుడూ విన్నాడు, కాని ఆయనలో ఏమీ చైతన్యం కలగలేదు.




ఈ కోటీశ్వరుడికి చినిగిన కుళాయి ఎందుకా అని ఆశ్చర్యపడుతూ ఆయన గదిలోకి వచ్చి, "ఆ పాతకుళాయి ఎక్కడ?" అని కూతుర్ని అడిగాడు.

యశోవతి ఆ కుళాయిని తండ్రి కిస్తూ, "నాన్నా, ఆ వచ్చిన మనిషి మీ అల్లుడు లాగున్నాడే!" అన్నది.

ఈ మాట విన్న తల్లి, "ఛీ, తప్పుడు దానా! మేం మళ్ళీ పెళ్లి చేస్తామే అని కాళ్ళావేళ్ళా పడితే పాతివ్రత్యం నటించి, ఎవడో ఎర్రగా, బుర్రగా, సరిగ బట్టలు కట్టుకుని రాగానే నీ మొగుడులా గున్నా డంటావా? ఆ రోగిష్టి వాడే నాడో గంగలో కలిసిపోయాడు. పిచ్చిమాటలాడకు!" అని మందలించింది.

ఆ మాటలతో యశోవతి చేసేది లేక నోరు మూసుకున్నది.

ఆ రాత్రి తన భార్య ఈ మాట చెబితే, సుమిత్రుడు భార్యను కోప్పడి, "దాన్నెం దుకు మందలించావు? దాని కీ మనిషి మీద మనసు పోతే మరీ మంచిది కదా! ఈ మనిషే మన అమ్మాయిని చేసుకుంటా నని ముందు అడిగించాడు. అది పెళ్ళాడ దని నేను పడగొట్టాను. ఇప్పు డది పెళ్లాడే ఉద్దేశంతో ఉంటే అంతకంటె కావలిసిందే ముంది? కోటీశ్వరుడు! దాని అదృష్టం గాని, ఇటువంటి అల్లుడు కావాలంటే దొరుకుతాడా?" అన్నాడు.

"అయితే రేపు అతన్ని కదిలించి చూడు. అమ్మాయి సరేనంటే పెళ్లి చేసేద్దాం," అన్నది భార్య.

మర్నాడు సుమిత్రుడు తన కూతురి పెళ్లి మాట ఎత్తినప్పుడు సుందరవదనుడు, "మీ అల్లుడు ఎలా చనిపోయాడు?" అని అడిగాడు.

"ఏం చెప్పమంటావు? అతను కట్టెలు తీసుకురావటానికి ఒడ్డుకు వెళ్ళాడు. ఆ సంగతి తెలీక నేను పడవ నడుపుకు

పోయాను. తిరిగివెళ్ళి చూస్తే అతని జాడ లేదు. అతను చాలా జబ్బుగా, కూడా ఉన్నాడు. అప్పుడే చావు బతుకుల్లో ఉన్నాడు. పోయి ఉంటాడు," అన్నాడు సుమిత్రుడు.

"నాతోనే అబద్ధాలాడుతున్నావా, మామా. నీ అల్లుడు చావలేదు. నేనే నీ అల్లుణ్ణి!" అన్నాడు సుందరవదనుడు.

"నేను చెబితే విన్నారుకారు!" అన్నది యశోవతి గదిలో నుంచి బయటికి వచ్చి.

సుందరవదనుడు తన భార్యను కౌగలించుకుని, "ఎలా ఉన్నావు?" అన్నాడు. ఇద్దరూ ఆనందబాష్పాలు రాల్చారు.

అత్తమామలకు అల్లుడి ముఖం చూడటానికి కూడా ధైర్యం లేకపోయింది. కాని అతను తన మామచేత పడవ పని మాన్పించి, తన వెంట తీసుకుపోయి, "ఈ ముసలితనంలో మిమ్మల్ని సుఖపెట్టటం నా ధర్మం," అని, అత్తమామలకు యావజ్జీవం ఏ లోటూ లేకుండా జరిపించాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, తనకు క్షమించరాని ద్రోహం చేసిన తన అత్తమామలను సుందరవదను డెందుకు చేరదీసి ఆదరించాడు? దీనికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "అత్తమామలు చేసిన ఆ ద్రోహం మూలంగానే సుందరపదనుడి కష్టాలన్నీ గట్టెక్కాయి. కొద్ది మాసాలలో క్షయవాతపడి చావనున్నవాడు కోలుకున్నాడు, కోటీశ్వరుడయాడు. తన కష్టసుఖాలలో అత్తమామల పాత్ర నిమిత్తమాత్రమైనదని గ్రహించి అతను వాళ్ళను వార్ధక్యంలో ఆదుకున్నాడు," అన్నాడు.

రాజు కీ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై తిరిగి చెట్టెక్కాడు. (కల్పితం)





# రాజుగారి ఖజానా

ఒకప్పుడు లంబకద్వీపాన్ని ఒక ఉత్తము డైన రాజు పాలించేవాడు. ఆయన పరిపాల నలో ప్రజలు మహాసుఖపడ్డారు. ఆయన న్యాయాన్నీ, ధర్మాన్నీ తూచినట్టు నిర్ణ యించేవాడు.

అంత సమర్థుడై ఉండి కూడా ఆ రాజు తీవ్రమైన సమస్యను ఎదుర్కోవలిసి వచ్చింది. ఆయన ఖజానా క్రమంగా ఖాళీ కాసాగింది. ఏ కారణంచేతనో ప్రజలిచ్చే పన్నులు సక్రమంగా ఖజానాకు చేరటం లేదు. ప్రజలు పన్నులు సరిగా ఇవ్వటం లేదన్న అనుమానం రాజుకు లేదు. వాళ్ళ రాజభక్తిని శంకించటానికి వీల్లేదు. పన్నులు కూడా భారమైనవి కావు. "తలా గుప్పెడు బియ్యమూ ఇస్తే నా ఖజానా నిండుతుంది," అనేవాడు రాజుగారు. పంటలు రాగానే ప్రతి ఇంటిపెద్దా, తన ఇంట్లో ఉండేవారి సంఖ్యనుబట్టి పన్ను ఎంచి గ్రామాధికారికి ఇస్తాడు. ఇలా గ్రామాలలో వసూలైన పన్ను లను గ్రామాధికార్లు తీసుకుపోయి మండ లాధికార్లకు ఇస్తారు. వాళ్ళా సొమ్మును తమ పైనవుండే సామంతుల కిస్తారు. సామంతులు తాము వసూలు చేసిన పన్ను లను తీసుకుపోయి రాజుగారికి చెల్లిస్తారు.

లంబకరాజ్య మంతా పన్నెండు మంది సామంతుల ఏలుబడి కింద ఉన్నది. ఒక్కొక్క సామంతుడి కిందా కొన్ని మండ లాలూ, ఒక్కొక్క మండలంలోనూ కొన్ని గ్రామాలూ ఉన్నాయి. ప్రజలు ఇచ్చు కుంటున్న పన్నులలో కొంత భాగం గ్రామాధికార్ల దగ్గిరో, మండలాధికార్ల దగ్గిరో, సామంతుల దగ్గిరో దిగబడిపోయి రాజుగారి ఖజానా చేరటం లేదు. ఇంతమంది చేతుల మీదుగా వచ్చే సొమ్ము ఎవరెవరి చేతులకు ఎంతెంత అంటుకుపోతున్నదీ నిర్ణయిం చటం తేలికకాదు.

ఆర్. నరసింహారావు




రాజుగారికి తన దేశంలో ఉండే గ్రామాల సంఖ్యా, ఒక్కొక్క గ్రామంలోనూ ఉండే జనాభా సంఖ్యా విడివిడిగా తెలిస్తే, ఖజానా సొత్తు కాజేసేదెవరో తెలిసిపోతుంది. కాని ఎవరికీ తెలియకుండా ఈ లెక్కలు రాబట్టాలి. అందుకు ఉపాయమేమిటా అని రాజుగారు వారం రోజుల పాటు తల పగలగొట్టుకుని, చివరకు ఒక దారి తెలుసుకున్నాడు.

రాజుగారు మనుషులను పంపించి తన రాజ్యంలో ఉన్న పన్నెండు మంది సామంతులనూ, వారి కింద ఉండే మండలాధికారులందరినీ రాజధానికి పిలిపించి పెద్ద సభ చేశాడు. ఆ సభలో అయన వచ్చిన వారితో ఇలా చెప్పాడు:

"మనందరికీ, మన ప్రజలకూ, మన దేశానికీ సంబంధించిన అతి ముఖ్యమైన విషయం మీకు చెప్పటానికే మిమ్మల్ని పిలిపించాను. ఈ మధ్య ఒక రాత్రి లంబకేశ్వరస్వామి నాకు కలలో ప్రత్యక్షమై, సుభిక్షంగా ఉన్న మన దేశానికీ, మనకు సమీపంలో ఉండే అనేక ద్వీపాలకూ అనేక పీడలూ, అరిష్టాలూ, ఈతిబాధలూ సంప్రాప్తించబోతున్నాయని చెప్పారు. మన దేశానికి అవి రాకుండా ఉపాయం చెప్పమని నేను స్వామివారిని వేడుకున్నాను. అయన నా కిచ్చిన సలహా ఏమిటంటే: మనం పన్నెండు కత్తులు చేయించి, స్వామివారికి వాటిని నివేదించి, ఆలయంలో ఉంచాలి. వీటిని ఎలా తయారుచేయటం? ప్రతి గ్రామంలోని ప్రతి మనిషి తరఫునా ఒక్కొక్క సూది చొప్పున వసూలుచేసి, గ్రామాధికారి తన గ్రామం తాలూకు సూదులన్నీ ఒక కట్టకట్టి, దానిపైన తన గ్రామం పేరు గల చీటీ అంటించాలి. ఇలా ప్రతి గ్రామాధికారీ తెచ్చి ఇచ్చిన కట్టలను మండలాధికారులు వసూలుచేసి, సామంతులకు అందజేస్తే, ఒక్కొక్క సామంతూ పోగు

చేసిన సూదులతో ఒక్కొక్క కత్తి తయారవుతుంది. తరవాత ఏ గ్రామంలో ఎలాటి కరువుగాని, అంటువ్యాధిగాని, మరొక ఈతి బాధగాని కలిగినా, అది ఏ సామంతుడి కింద ఉండే మండలానికి చెందిన గ్రామమైతే ఆ సామంతుడికి చెందిన కత్తిని ఆ గ్రామానికి పంపిస్తాం. వెంటనే ఈతి బాధ తొలగిపోతుంది. అలా తొలగని పక్షంలో ఆ కత్తిలో చేరవలసిన సూదులన్నీ చేరలేదన్న మాటే. అటువంటి పొరపాటు జరగకుండా దేశంలోని ప్రతి వ్యక్తి తరఫునా ఒక్కొక్క సూది వసూలయేటట్టు చూసి, గ్రామాధికార్లు పంపిన కట్టలన్నీ కలిపి మండలాధికార్లు పెద్దకట్టలు కట్టి, మండలాధికార్లు పంపిన కట్టలను సామంతులు మోపులు కట్టి, ఏ మాత్రమూ పొరపాటు లేకుండా రాజధానికి చేర్చే పూచీ మీది ; ఆ సూదులతో కత్తులు తయారు చేయించి, వాటిని లంబకేశ్వరస్వామి వారికి అర్పించి, వాటికి యథావిధిగా పూజా, అర్చనా, పులికాపూ జరిగేటట్టు చూసే భారం నాది," అన్నాడు రాజు.

రాజుగారి మాటలలో సామంతులకూ, మండలాధికార్లకూ గురి కుదిరింది. గ్రామాలలో సూదులు చురుకుగా వసూలయాయి. ప్రతి గ్రామాధికారీ తన గ్రామంలో ఎంద





రున్నారో అందరి సంఖ్యకూ సరిపడా సూదులు పోగుచేసి, కట్టగట్టి, దానికి తమ గ్రామం పేరుగల చీటీ తగిలించి మండలాధి కారికి పంపాడు. మండలాధికార్లు తమకు చేరిన కట్టలను పెద్దకట్ట కట్టి సామంతుల ఆస్థానాలకు చేర్పించారు. పన్నెండుమంది సామంతుల ఆస్థానాల నుంచీ పన్నెండు బళ్ళ మీద సూదుల కట్టలు రాజుగారి దివాణానికి చేరాయి.

రాజుగారూ, ఆయన పరివారమూ ఒక రాత్రల్లా కూర్చుని గ్రామాల జాబితా, ఏ మండలం కింద ఏయే గ్రామాలున్నదీ, ఏ గ్రామంలో ఎంతమంది ఉన్నదీ లెక్కలు తయారుచేశారు. రాజుగారికి కావలసిన చిఠా అంతా తయారయింది.

మంచిరోజు చూసి రాజుగారు రాజధాని మధ్య పన్నెండు కొలుములు ఏర్పాటు చేయించి, సమర్థులైన కమ్మరుల చేత పన్నెండు కత్తులు చేయించాడు. తరవాత ఆ కత్తులను నగరమంతటా ఊరేగించి, వాటికి హారతులు పట్టించి, తీసుకుపోయి లంబకేశ్వరాలయంలో ఉంచారు.

ఆ తరవాత పన్నుల వసూలు సక్రమంగా సాగింది. ఎవరైనా తక్కువ పన్ను తెచ్చినప్పుడు, "ఇంత కన్న తక్కువమంది గల గ్రామం నుంచి హెచ్చు పన్ను వచ్చిందే? మీరు పన్నులు శ్రద్ధగా వసూలు చెయ్యనట్టు కనిపిస్తుంది," అని రాజుగారు అన్న మీదట, పన్నులు వసూలు చేసేవాళ్ళు రాజధనం కాజెయ్యటం మానేశారు. రాజుగారి బొక్కసం తిరిగి నిండింది.

ఇక కత్తుల మాట. ఎక్కడైనా ఈతి బాధలు వస్తే అక్కడికి ఆ గ్రామానికి సంబంధించిన కత్తి పంపేవారు. బాధ నివారణ అయితే అయేది; కానప్పుడు, "సూదులు పంపడంలో ఏదో తభావతు వచ్చి ఉంటుంది," అని గ్రామస్థులు అనుకునేవారు.






# మంత్రవిద్య

ఒక ఊళ్ళో మాదన్న అని ఒక బద్ధకస్తు డుండేవాడు. అతనికి ఏం పనిచెయ్యాలన్నా ఒళ్ళు వంగేది కాదు. ఒళ్ళు వంచి పని చెయ్యటం కన్న అసహ్యం మరొకటి లేదనీ, మంత్రవిద్యలు నేర్చినట్టయితే వాటితో హాయిగా జీవయాత్ర కొనసాగించవచ్చుననీ మాదన్నకు అనిపించింది.

ఊరికి దూరంగా కొండల మధ్య ఒక మఠంలో ఒక సిద్ధుడుండేవాడు. ఆయనకు అనేక మంత్రవిద్యలు తెలుసును. మాదన్న ఆ సిద్ధుణ్ణి వెతుక్కుంటూ వెళ్ళాడు. అతను మఠం చేరేసరికి సిద్ధుడు దర్భాసనం పైన పద్మాసనం వేసుకుని కూర్చుని ఉన్నాడు. ఆయన శిష్యులు ఏవేవో పనులలో నిమగ్నులై ఉన్నారు.

మాదన్న సిద్ధుడికి ప్రణామం చేసి, చేతులు జోడించి, "స్వామీ, నన్ను కూడా తమ శిష్యవర్గంలో చేర్చుకుని మంత్రవిద్య ప్రసాదించండి. తమ పేరు చెప్పుకుని హాయిగాబతుకుతాను," అని వేడుకున్నాడు.

సిద్ధుడు తల అడ్డంగా తిప్పి, "మంత్ర విద్యలు నేర్వగల శక్తి నీలో లేదు, నాయనా," అన్నాడు.

ఈ మాటకు మాదన్నకు ఆశాభంగ మయింది. అయితే సిద్ధుడు అతన్ని వెళ్ళి పొమ్మనలేదు గనక, కాస్త ధైర్యం తెచ్చు కుని, "అయినా ప్రయత్నించి చూడాలని ఉంది. నన్నిక్కడే ఉండనివ్వండి," అని ప్రాధేయపడ్డాడు.

"నా కేమీ అభ్యంతరం లేదు. నా మిగి లిన శిష్యులతోబాటు నువు కూడా మఠంలో ఉండవచ్చు," అన్నాడు సిద్ధుడు. ఆయ నకు తన పైన ఆపాటి అనుగ్రహమైనా కలిగి నందుకు మాదన్న సంతోషించాడు.

మర్నాడు తూర్పు తెల్లవారేవేళ సిద్ధుడు మాదన్నను తన వద్దకు పిలిపించి, ఒక

ఎల్. హరిప్రసాద్

గొడ్డలి ఇచ్చి, అడవికిపోయి వంటకట్టెలు కొట్టుకురమ్మన్నాడు.

కట్టెలు కొట్టితే మంత్రవిద్య సిద్ధించదు. అలాటి మొరటుపనులు మాదన్నకు ఇంటా వంటా కూడా లేవు. అయినా అతను వెళ్ళి వంట కట్టెలు కొట్టి తెచ్చాడు.

అయితే ఈ శ్రమ ఒకరోజుతో కాలేదు. సిద్ధుడు వరసగా నెలరోజులపాటు మాదన్నను కట్టెలుకొట్టే పనిమీద పంపాడు. మాదన్న తన జీవితంలో అంత శ్రమ ఏనాడూ పడలేదు. కట్టెలుకొట్టి అతని చేతులూ, అడవికీ మఠానికీ మధ్య నడిచి అతని కాళ్ళూ బొబ్బలెక్కాయి.

ఒకనాటి సాయంకాలం కాస్త చీకటిపడి, మాదన్న కట్టెలమోపుతో మఠం చేరేసరికి, లోపల సిద్ధుడి వెంట మరి ఇద్దరు కొత్త వాళ్ళెవరో ఉన్నారు. ముగ్గురూ కలిసి మాట్లాడుకుంటున్నారు. వాళ్ళున్న గదిలో చాలా చీకటిగానే ఉన్నది. అయినా సిద్ధుడు, మామూలు ప్రకారం తన శిష్యులను పిలిచి దీపం తీసుకురమ్మనక, తానే స్వయంగా లేచి గోడ మీద బొగ్గుతో ఒక వలయం గీశాడు.

వెంటనే ఆ వలయం చంద్రుడిలాగా ప్రకాశించ నారంభించి, చల్లని వెన్నెలను గది అంతటా ప్రసరింపజేసింది.



తరవాత కొత్తవారిలో ఒకడు, "కొంచెం సేపు వినోదం ఏర్పాటు చేద్దాం," అంటూ ఒక సమిధపుల్లను గోడ మీది వలయం కేసి విసిరాడు. అది చిన్న ప్రమాణం గల అప్సరసగా మారి వలయం నుంచి గదిలోకి నడిచివచ్చి, మామూలు ఆడదాని ప్రమాణానికి పెరిగి కొంతసేపు నృత్యం చేస్తూ పాడింది. చిట్టచివరకు ఆ అప్సరస తిరిగి సమిధగా మారి కింద పడిపోయింది.

కొత్తగా వచ్చినవారిలో రెండోవాడు తన చేతిలో ఉండే బుల్లిరాగి చెంబును సిద్ధుడి శిష్యుల కిస్తూ, "ఇందులో ఉన్న పాయసం మీరంతా కడుపునిండా తాగండి," అన్నాడు.

అందులో పాయసమే ఉంటే అది ఒక్క గుక్కకే చాలేటట్టు మాదన్నకు తోచలేదు. కాని అందులోని పాయసంతోనే అందరి కడుపులూ నిండిపోయాయి.

తరవాత సిద్ధుడు కొత్తవాళ్ళతో, "మనం కాస్సేపు చంద్రమండలం మీద విహరించి వద్దాం," అన్నాడు.

మాదన్న చూస్తూ ఉండగానే ముగ్గురూ గోడ మీది చంద్రుడి మీదికి వెళ్ళి దాని మీద కూర్చున్నారు. కొంతసేపు వారు ఏదోమాట్లాడుతూ తలలు ఆడించటమూ, చేతులు కదిలించటమూ స్పష్టంగా శిష్యులందరికీ కనిపించింది.





మాదన్న సిద్ధుడితో ఒకనాడు, "స్వామీ, నేను మూడుమాసాలుగా తమకు శుశ్రూష చేశాను. ఈ మూడుమాసాలూ నేను కట్టెలు కొట్టడం తప్ప మరేదీ చెయ్యలేదు. ఇలాంటి కఠినమైన పని నా జీవితంలో ఎన్నడూ చేసి ఉండలేదు; నాకు యిలాంటి శరీరశ్రమ అలవాటు లేదు కూడా. ఇక నాకు ఇంటి మీద ధ్యాస మళ్ళింది," అన్నాడు.

"తప్పకుండా వెళ్ళు. నీకు శక్తి చాల దని మొదటే చెప్పాను. కావలిస్తే రేపు ఉదయమే వెళ్ళవచ్చు, నా అభ్యంతరం ఏమీలేదు," అన్నాడు సిద్ధుడు.

"స్వామీ, ఇంత కాలం శరీరం హూనం చేసుకుని తమ పరిచర్య చేసినందుకు ఒక్క చిన్న మంత్రమైనా ఉపదేశించరా?" అన్నాడు మాదన్న.

"దానికే మభ్యంతరం? నీ కే మంత్రం నేర్చుకోవాలని వున్నదో చెప్పు," అని సిద్ధుడు అడిగాడు.

"తమరు పచార్లు చేసేటప్పుడు గోడల కుండా కూడా నడవటం గమనించాను. ఆ శక్తి నా కిప్పించారంటే నేను తృప్తి పడ తాను," అన్నాడు మాదన్న.

సిద్ధుడు నవ్వాడు. అయన మాదన్నకు ఒక చిన్న మంత్రం చెప్పి, అదే మంత్రం

అంతలోనే గోడ మీది చంద్రుడు అక స్మాత్తుగా ఆరిపోయాడు. గది అంతా చీకటి అయిపోయింది. శిష్యులు దీపం వెలిగించి తెచ్చేసరికి గదిలో సిద్ధుడు మాత్రమే కూర్చుని ఉన్నాడు. ఆయన తన శిష్యు లతో జరిగినదాన్ని గురించి ఏమీ అనక, "మీరంతా త్వరగా వెళ్ళి నిద్రపొండి. రేపు పెందలాడే లేవవలిసి ఉంటుంది," అని చెప్పాడు.

తరవాత మరి రెండు మాసాలు గడి చాయి. మాదన్న కట్టెలు కొట్టి తెస్తూనే ఉన్నాడు. సిద్ధుడు అతనికి మంత్రోపదేశం చేసే లక్షణా లేవీ కనబడలేదు.

తాను పఠించుతూ గోడకుండా అవతలి గదిలోకి వెళ్ళి మళ్ళీ తిరిగి వచ్చాడు.

మాదన్న, సిద్ధుడు నేర్పిన మంత్రాన్ని పఠిస్తూ తాను కూడా అవతలి గదిలోకి వెళ్ళబోయాడు గాని, గోడ అడ్డు తగిలి అతన్ని తన కుండా పోనివ్వలేదు.

"అలా మెల్లిగా నడవకు. తల వంచి వేగంగా పరిగెట్టితే గోడ కుండా దూసుకు పోగలుగుతావు," అన్నాడు సిద్ధుడు. సిద్ధుడు చెప్పినట్టే చేసి మాదన్న గోడ కుండా అవతలి గదిలోకి వెళ్ళగలిగాడు. అతను చుట్టు తిరిగి సిద్ధు డున్న గదిలోకి వచ్చి, అయనకు కృతజ్ఞత తెలుపుకున్నాడు.

"విద్య వచ్చిందిగదా అని అడ్డమైన వాళ్ళ దగ్గిరా చీటికీ మాటికీ ప్రదర్శించకు. జాగ్రత్త!" అని హెచ్చరించి, సిద్ధుడు మాదన్నను పంపేశాడు.

మాదన్న ఇంటికి తిరిగి వెళుతూనే, తాను అద్భుత శక్తు లెన్నో సాధించుకు వచ్చినట్టు ఊళ్ళో వాళ్ళందరికీ చెప్పేశాడు. కాని తాను సాధించిన శక్తులు ఫలానా అని అతను ఎవరికీ స్పష్టంగా చెప్పలేదు. అందుచేత అతని మాటలు ఎవరూ నమ్మలేదు.

చివరకు మాదన్న ఊళ్ళోవాళ్ళ మెప్పు కోసం బహిరంగ ప్రదర్శన ఏర్పాటు చేశాడు. ఊళ్ళోవాళ్ళంతా ఒక చోట మూగారు. మాదన్న మంత్రం చదువుతూ, పొటేలు లాగా తల వంచి ఎదురుగా ఉన్న గోడ కేసి పరిగెత్తుకుంటూ వెళ్ళి, గోడకు తల అడుచుకుని, స్పృహ తప్పి పడిపోయాడు. నెత్తి మీద నిమ్మకాయంత బొప్పి కట్టింది. ఊళ్ళో వాళ్ళంతా మాదన్న మంత్రశక్తి గురించి చెప్పుకుని, చెప్పుకుని చాలా ఏళ్ళపాటు నవ్వుకున్నారు.

అందుకే మనం, ఎవరన్నా అలవిగాని పని తలపెట్టి అభాసు పాలవబోతూంటే, "ఎందుకురా గోడ కేసి తలకొట్టుకుంటావూ?" అంటాం.





# దొరకని దొంగ

ఒక సుల్తానుగారి రాజ్యంలో ఒక పెద్దమని షికి ఇద్దరు కొడుకులుండేవాళ్ళు. ఆ పెద్ద మనిషి వృద్ధాప్యంతో చనిపోతూ, తన కొడు కులను పిలిచి, "నాయనలారా, ఇన్నాళ్ళూ నా చాటున సుఖంగా బతికారు. ఇకనుంచీ మీ బతుకుతెరువు మీరే చూసుకోవాలి. మిగి లిన వృత్తులతో మీకు సుఖంగా జరగక పోవచ్చు. అందుచేత దొంగతనం నేర్చు కోండి," అని సలహా ఇచ్చి, ప్రాణాలు వదిలాడు.

చోరవిద్యలో ప్రఖ్యాతి పొందిన ఒక ముసలివాడి దగ్గిరికి వెళ్ళి, అన్నదమ్ములు చోరవిద్య అభ్యసించ నారంభించారు. కొంతకాలం గడిచింది. ఒకనాడు గురువు గారు తన శిష్యులకు దొంగతనంలో నేర్పు ఎలా ఉంటుందో ప్రత్యక్షంగా చూపుదా మని, ఒక చెట్టు ఎక్కి, దాని మీది గూట్లో నిద్రపోతున్న పక్షిని నిద్ర లేవనీకుండా సంగ్రహించి చెట్టు దిగి వచ్చాడు. తీరా గురువుగారు ఆ పక్షిని తన శిష్యులకు చూపుదామనుకునే సరికి, అది పెద్దవాడి చేతిలో నిద్రపోతూ ఉన్నది.

గురువుగారు తన శిష్యుల హస్తలాఘ వానికి మెచ్చుకుని, "ఇక నేను మీకు నేర్పేదేమీ లేదు. మీరు వెళ్ళి మీ వృత్తి చూసుకుంటూ సుఖంగా బతకండి," అని ఆశీర్వదించి ఆ అన్నదమ్ములను పంపే శాడు. వాళ్ళు తమ ఇంటికి తిరిగివచ్చి, నగరంలో దొంగతనాల ద్వారా ధనం ఆర్జిస్తూ జీవించసాగారు.

ఒకనాడు తమ్ముడు అన్నతో, "ఈ చిల్లర వ్యాపారం ఏమీ బాగాలేదు. మనం సుల్తాను గారి ఖజానా కొల్లగొట్టితే ఘనంగా ఉంటుం దేమో!" అన్నాడు.

"తప్పకుండా! మన తండ్రి చనిపోతూ ధనికులనే దోచమనీ, దరిద్రుల జోలికి

హెచ్. సోమసుందరం

పోవద్దనీ బోధించాడు. సుల్తానుగారి కన్న ధనికు డెవడుంటాడు?" అన్నాడు అన్న.

ఒక చీకటిరాత్రి అన్నదమ్ము లిద్దరూ సుల్తానుగారి మహలుకు కన్నం వేశారు. బక్కగా ఉండే తమ్ముడు లోపలికి దూరి, దొరికిన బంగారు నగలూ, నాణాల సంచులూ, గిన్నెలూ, రత్నాభరణాలూ, రత్నాలు తాపిన పిడులు గల కత్తులూ అన్నకు అందించాడు. ఇద్దరూ మోయ గలిగినన్ని వస్తువులు సంగ్రహించి, వాటిని గోతాలలో వేసుకుని, ఇంటికి వెళ్ళిపోయారు.

మర్నాడు దొంగతనం బయటపడింది. పోయిన వస్తువులు ఒకటీ, రెండూ అయితే సుల్తానుకు దొంగతనం జరిగినట్టు తెలియక పోను. కాని చాలా వస్తువులు పోయాయి. అందుచేత సుల్తాను వజీరును పిలిపించి, "వజీరూ, దొంగ మన మహలులోకి ఎట్లా ప్రవేశించా డంటావు?" అని అడిగాడు.

"కన్నం వేసి ఉంటాడు. సందేహం లేదు," అన్నాడు వజీరు.

"ఆ కన్నం ఎక్కడ వేశాడో మనకు ఎలా తెలుస్తుందంటావు?" అని సుల్తాను మళ్ళీ అడిగాడు.

"అది కనిపెట్టడం కూడా కష్టమేనా? మహలు కిటికీలూ, తలుపులూ మూసేసి



లొపల పొగ పెట్టండి. మహలు చుట్టూ మన భటులను నిలబెట్టండి. లోపల పెట్టిన పొగ మహలులో నుంచి ఎక్కడ బయటికి వస్తుందో అక్కడే ఉంటుంది కన్నం," అన్నాడు వజీరు.

వజీరు చెప్పినట్టే చేశారు. దొంగ వేసిన కన్నం బయటపడింది. బయట నిలబడి ఉన్న భటులలో ఒకడు సుల్తాను వద్దకు పరిగెత్తుకుంటూ వచ్చి, "దొంగ వేసిన కన్నం బయటపడింది, హుజూర్," అన్నాడు సంతోషంగా.

"వెధవ కన్నం ఎవడిక్కావాలి? దొంగ ఎక్కడ?" అన్నాడు సుల్తాను.



"ఆ కన్నంలో ఇప్పుడు దొంగ లేడు, హుజూర్," అన్నాడు భటుడు విచారంగా.

"వజీరూ, దొంగ కన్నంలో లేడుట. ఇప్పుడు మనం ఏం చెయ్యాలి?" అని అడిగాడు సుల్తాను.

"కన్నానికి కాపలా పెట్టిద్దాం. దొంగ మళ్ళీ వచ్చి తీరుతాడు," అన్నాడు వజీరు.

వజీరు అన్నట్టుగానే అన్నదమ్ములు మళ్ళీ వచ్చారు. కన్నంలోకి దూరిన తమ్ముడు పట్టుబడ్డాడు. అన్న బయటి నుంచే పారిపోయాడు.

దొరికిన దొంగకు బేడీలు వేసి, భటులు వాణ్ణి సుల్తాను దగ్గిరికి ఈడ్చుకుపోయారు.

"వీడి తల తీసెయ్యండి!" అన్నాడు సుల్తాను రౌద్రంగా.

"తొందర పడకండి, హుజూర్. వీడికి మరొక దొంగ తోడున్నాడనటానికి సందేహం లేదు. అందుచేత వీణ్ణి బోనులో పెట్టి, మన కోటగోడ వెలపల వేళ్ళాడదీయండి. రాజ భవనంలో దొంగతనం చేసినవాడికి ఏ గతి పట్టుతుందో నలుగురికీ తెలిసి, హెచ్చరికగా ఉంటుంది. అదీగాక, వీణ్ణి చూడవచ్చిన వారిలో వీణ్ణి చూసి జాలిపడే వాడెవడైనా ఉంటే మన భటులు వాణ్ణి వెంటనే పట్టు కుంటారు. వాడే వీడికి తోడుదొంగ అయి ఉంటాడు," అన్నాడు వజీరు.

తమ్ముణ్ణి బోనులో పెట్టి కోటగోడ వెలపల వేళ్ళాడదీశారు. జనం గుంపులు గుంపులుగా వచ్చి, కుళ్ళిన కాయలూ, పళ్ళూ బోను మీదికి విసురుతున్నారు. "రేపు వీడి తల నరికేస్తారుట!" అని అందరూ చెప్పుకుంటున్నారు. అక్కడి పరిస్థితి చూసి, తమ్ముణ్ణి విడిపించే ఉపాయం ఏదైనా ఉంటుందేమో తెలుసుకోవటానికి అన్న కూడా ఆ గుంపులో వచ్చి చేరి, అందరూ అనుకునేది విన్నాడు.

ఆ రాత్రి చీకటి పడ్డాక అన్న తన ముఖానికి ఒక తొడుగు తగిలించుకుని, భుజానికి



రెక్కలు కట్టుకుని, మంచి వేషంతో తయారై, ఒక గుర్ర మెక్కి, తమ్ముణ్ణి బంధించిన పంజరానికి భటులు కాపలా ఉన్న చోటికి ధైర్యంగా వెళ్ళాడు.

"ఎవరు నువు ?" అని భటులు అతన్ని ప్రశ్నించారు.

"సరాధముల్లారా, నన్ను గుర్తించలేదా ? నేను మృత్యుదూతను, అజ్రాయల్‌ను. అల్లా నన్ను పంపాడు. ఈ ఖైదీ నా సొత్తు. నేను పట్టుకుపోతాను," అంటూ అన్న కాపలావాళ్ళ చేతిలో ఉన్న బీగం లాగేసుకుని, పంజరం తెరిచి, తమ్ముణ్ణి బయటికి లాగి, గుర్రం మీద ఎక్కించుకుని, వాయు వేగంతో వెళ్ళిపోయాడు. భటులు భయంతో చేతులూ, కాళ్ళూ ఆడక కొయ్యబారి చూస్తూ ఉండిపోయారు.

ఆ రాత్రే తమ్ముడు ఆ రాజ్యం వదిలి శాశ్వతంగా మరొక దేశం పోయి అక్కడ బతకసాగాడు. ఎందుకంటే ఈ రాజ్యంలో ఇక వాడు బతకటం అసాధ్యం. వాణ్ణి అనేక వేలమంది చూశారు.

కాని అన్న మాత్రం వెళ్ళిపోలేదు. వాణ్ణి మృత్యుదూత వేషంలో తప్ప ఎవరూ చూడలేదు. అందుచేత వాణ్ణి దొంగ అని ఎవరూ పోల్చలేరు. రాజభవనం నుంచి తస్కరించిన సొమ్ము ఖర్చుచేస్తూ వాడు





కొంతకాలం సుఖంగా జీవించాడు. నగలూ, ఇతర వస్తువులూ మటుకు అలాగే ఉండి పోయాయి. వాటిని మార్చటానికిగాని, అమ్మటానికిగాని ప్రయత్నిస్తే, వాడే దొంగ అన్న సంగతి బయటపడుతుంది. వాడు రాజుగారికి దొరికి తీరుతాడు.

దొరికిన దొంగ తప్పించుకుపోయి నందుకు సుల్తాను చాలా బాధపడ్డాడు. దొరకని దొంగ తన భటుల కళ్ళలో దుమ్ము చల్లటం ఆయనను మరీ బాధించింది.

ఆయన తన వజీరును పిలిపించి, "వజీరూ, దొంగ మనని మోసంచేశాడు. ఇప్పుడేం చేద్దాం?" అని అడిగాడు.

"వాణ్ణి క్షణాల మీద పట్టేస్తాను, నా చేతి కొక పన్నెండు బంగారు మాడలు ఇప్పించండి," అన్నాడు వజీరు.

"వాటిని ఏం చేస్తావు?" అని సుల్తాను అడిగాడు.

"మన మహలుకు వచ్చేదారిలో వాటిని విదజల్లిస్తాను," అన్నాడు వజీరు.

"అందువల్ల ఏమవుతుంది?" అని సుల్తాను అడిగాడు.

"ఏమవుతుందని అడుగుతున్నారా? దొంగవాడైనవాడు వాటి కోసం రాకుండా ఉండగలడా? మామూలు దొంగలైతే, తమను పట్టుకోవటానికే వాటిని వేశారని గ్రహించి, వాటి జోలికిపోరు. కాని ధైర్య సాహసాలు గల గజదొంగ అలా విడిచి పెట్టడు. ఎలాగైనా వాటిని కాజెయ్యాలని యత్నిస్తాడు. మనం చాటుగా కాపలా ఉంచే భటులు వాణ్ణి యిట్టే పట్టేస్తారు," అన్నాడు వజీరు.

సుల్తాను సరేనని, వజీరుకు పన్నెండు బంగారు మాడలిప్పించాడు. వజీరు వాటిని రాజమార్గంలో వేయించి, రహస్య స్థలాలలో కాపలావాళ్ళను ఏర్పాటు చేశాడు.

దొంగ వాటిని చూసి, వాటికి కాపలా ఉంటుందని గ్రహించి, వాటిని తీసుకోకపోతే

తాను అప్రయోజకుడేనని నిశ్చయించుకుని, ఆ బంగారాన్ని కాజెయ్యటానికి ఒక పన్నాగం ఆలోచించాడు.

అతను ఒక వర్తకుడి వేషం వేసుకుని, ఒంటెలను అద్దె కిచ్చేవాడి వద్దకు వెళ్ళి, "నేను దూరప్రయాణం చేసి వస్తున్నాను. నా ఒంటెలు నగరానికి ఎడంగా విశ్రాంతీ, చికిత్సా పొందుతున్నాయి. కొంత సరుకు వెంటనే కోటకు చేర్చాలి. నీ ఒంటెలను పదింటిని సాయంకాలం దాకా అద్దెకియ్యి," అని డబ్బు ముందే ఇచ్చి పది ఒంటెలను బాడుగకు తెచ్చాడు. వాటి కాళ్ళకు జిగురు చాలా మందంగా పట్టించి, తాను ఒంటెలు తోలేవాడి వేషం వేసుకుని, రాజమార్గంలో బంగారు మాడలు పడి ఉన్న స్థలం మీదుగా తోలుకుపోయి, తిప్పి తీసుకొచ్చి, ఒంటెలకాళ్ళ జిగురు ఊడ లాగి, అందులో ఇరుక్కున్న మాడలను తీసుకుని, ఒంటెలను ఒంటెలవాడికి ఇచ్చేసి, ఇంటికి తిరిగి వెళ్ళిపోయాడు.

"మన కళ్ళలో మళ్ళీ దుమ్ముకొట్టి దొంగ మన మాడలు మాయం చేసేశాడు. నువు కాపలా వుంచిన భటులు ఏం అఘోరిస్తున్నారు? సరే, ఇప్పుడేం చేద్దామంటావు?" అని సుల్తాను వజీరు నడిగాడు.



వజీరు కొంచెం ఆలోచించి. "నగరంలో యావన్మంది కోసమూ ఒక బ్రహ్మాండమైన విందు ఏర్పాటు చెయ్యండి," అన్నాడు.

"అదొక దండగా? విందు చేస్తే ఏమవుతుంది?" అని సుల్తాను అడిగాడు.

"విందుకు దొంగ కూడా వస్తాడు. అసలట్టు చెప్పటం మరిచాను. ఈ దొంగ మొదటి దొంగను తప్పించినప్పుడు వాడు ముఖానికి తగిలించుకున్న తొడుగు కొంచెం తొలిగిందిట. అప్పుడు మన పహరావాళ్ళలో ఒకడు చూశాడట. వాడు దొంగను గుర్తించ గలనంటున్నాడు. విందు జరిగే చోట ముఖద్వారం వద్ద వాణ్ణి ఉంచుదాం. దొంగ

వస్తాడు. మన పహరావాడు వాణ్ణి పట్టి ఇస్తాడు," అన్నాడు వజీరు.

విందు ఏర్పాటయింది. వజీరు అను కున్నట్టే దొంగ వచ్చాడు. ముఖద్వారం వద్ద ఉన్న కాపలావాడు దొంగను చూస్తూనే తొందరపడి, "దొంగ, దొంగ!" అని అరిచి పట్టుకోబోయాడు. వాడి చేతికి దొంగ కుడి మీసం మాత్రమే దొరికింది. దొంగ చప్పున మొల నుంచి కత్తి లాగి, తన కుడి మీసం కోసేసి, లోపలికి పారిపోయాడు.

మిగిలిన భటులూ, సుల్తానూ ముఖ ద్వారం వద్దకు వచ్చి చూసే సమయానికి, పహరావాడి చేతిలో దొంగ మీసం తప్ప ఇంకేమీ లేవు.

"మళ్ళీ దొంగను జారిపోనిచ్చామా?" అన్నాడు సుల్తాను నిస్పృహగా.

"వాడెక్కడికి పోతాడు? విందులోవాళ్ళ లోనే ఉంటాడు. బయటికి వస్తే ఇటుగానే గదా రావాలి? వాడు చిక్కాడే అనుకోండి," అని వజీరు భటులతో, "మీరు విందులో ఉన్న వాళ్ళందరినీ వెతికి, కుడిమీసం లేని వాణ్ణి పట్టుకురండి," అన్నాడు.

కొద్దిసేపట్లో భటులు పదిమందిని పట్టు కొచ్చారు. వారిలో ఎవడికీ కుడిమీసం లేదు. దొంగ జనం మధ్య తిరుగుతూ గబగబా పదిమంది కుడిమీసాలు తన కత్తితో కోసి, తన ఎడమమీసం కూడా కోసుకుని, అంద రితో బాటు విందుపదార్థాలు ఆరగిస్తూ, వినోదం చూస్తున్నాడు.

మర్నాడు సుల్తాను వజీరును పిలిచి, "వజీరూ, నీకు పెద్దతనం వచ్చేసింది. విశ్రాంతి తీసుకో. వెంటనే చాటింపు వేయించు—నాకు చిక్కకుండా ఉండే గజదొంగ నా దగ్గిరికి వచ్చినట్టయితే, నా కూతురి నిచ్చి పెళ్ళిచేసి, నా వజీరుగా వేసుకుంటానని!" అన్నాడు.

ఆ విధంగా దొంగ సుల్తానుగారి అల్లుడూ, వజీరూ అయి సుఖంగా జీవించాడు.





# కృష్ణావతారం

విక్రుడు చెప్పిన మాటలు కృష్ణుడు శ్రద్ధగా విని, "దీనికి ప్రస్తుతం ఒకటే ఉపాయం తోస్తున్నది. నేనూ, అన్నా కూడా వెంటనే బయలుదేరి, జరాసంధుడు మొదలైనవారు చూస్తూండగా దక్షిణ దిక్కుగా పోతాం. అప్పు డతను మధురానగరాన్ని ముట్టడించే యత్నం మాని మా వెంట పడతాడు. మేము వింధ్యాద్రి మొదలైన పర్వతాలలో గల దుర్గాలను పట్టుకుని, జరాసంధుడితో యుద్ధం చేస్తాం. మే మిలా చెయ్యటం వల్ల మన కులం వారికీ, రాష్ట్ర పౌరులకూ అపద తప్పుతుంది," అన్నాడు.

దీనికి అందరూ సమ్మతించారు. బలరామ కృష్ణులు నిరాయుధులై మధుర నుంచి బయలుదేరి, ధైర్యంగా జరాసంధుడి దగ్గిరికే వెళ్ళి, "మగధరాజా, నానా దేశాల సైన్యాలను వెంట బెట్టుకుని ఇక్కడికి ఏ ఉద్దేశంతో వచ్చావో చెప్పు. మేము కూడా సహాయం చేస్తాం," అన్నారు.

జరాసంధుడు కృష్ణ బలరాముల రాక విని, కవచమూ, బాణమూ, రెండు అంబుల పొదులూ ధరించి వచ్చి, "మీ రిద్దరూ మహా బలవంతులని విని, మిమ్మల్ని యుద్ధంలో గెలుద్దామనే ఉద్దేశంతో నే వచ్చాను. మీ ప్రాణాలు తీయకుండా తిరిగి వెళ్ళేది లేదు. కనక మీరు కూడా యుద్ధ సన్నద్ధులై రండి," అన్నాడు.

అత నా మాట అనగానే బలరామ కృష్ణులు కొంచెం కూడా తొణకకుండా, అక్కడి నుంచి బయలుదేరి దక్షిణదిక్కుగా

13. జరాసంధ పరాజయం





తేజాలతో వెలిగిపోతున్న పరశురాముణ్ణి సమీపించి, బలరామకృష్ణులు ఆయన కాళ్ళకు తలలు తాకేలాగా ప్రణామం చేసి, ఆయనను స్తోత్రం చేశారు.

కృష్ణుడు ఆయనకు తమ కథను సంగ్రహంగా తెలుపుతూ, "మహాత్మా, మా నివాసం యమునా నదీ ప్రాంతాన గల మధుర. యాదవ శ్రేష్ఠుడైన వసుదేవుడు మా తండ్రి. నా పేరు కృష్ణుడు, మా అన్న పేరు బలరాముడు. కంసుడి భయం చేత మా తండ్రి మమ్మల్ని పుట్టినప్పుడే గోకులానికి పంపెయ్యగా, అక్కడ పెరిగి పెద్దవాళ్ళమయాము. తరవాత మధురా నగరానికి తిరిగి వచ్చి, కంసుణ్ణి చంపి, అతని రాజ్యాన్ని అతని తండ్రికే ఇచ్చాం. కంసుణ్ణి చంపినందుకు మా మీద అలిగి జరాసంధుడు మా మీదికి పెద్ద సేనతో ఎత్తి వచ్చాడు. నిరాయుధులం కాపటంచేత అతనితో యుద్ధం చేసే అవకాశం లేక, అతను చూస్తుండగానే కాలినడకన ఇటుగా వచ్చాం. మే మిప్పుడేం చెయ్యాలో సలహా ఇచ్చి మమ్మల్ని అనుగ్రహించండి," అని కోరాడు.

పరశురాముడు అంతా విని, "మీ రిటు దక్షిణాపథానికి రావటం చూశాడు కనక,

నడుచుకుంటూ వెళ్ళిపోయారు. వాళ్ళు అలా అనేక దేశాలూ, నగరాలూ దాటి, వింధ్యారణ్యాలను సమీపించి, సహ్యాద్రి మీది అరణ్యంలో ఒక మహా వటవృక్షం కింద పరశురాముణ్ణి చూశారు.

అక్కడ పరశురాముడు శివార్చన చేస్తున్నాడు. ఒక పక్కగా హోమధేనువు, దూడతో సహా కట్టి ఉన్నది. ఆయనకు ఒక పక్కన స్రుక్స్రువాలూ, అరణీ, కమండలువూ, చక్కగా ప్రజ్వలిస్తున్న అగ్నీ ఉన్నాయి; మరొక పక్కన ఒక మహా ధనువూ, బాణాలూ, ఖడ్గమూ, గండ్రగొడ్డలీ ఉన్నాయి. ఈ విధంగా బ్రాహ్మణ క్షాత్ర





జరాసంధుడు తన సైన్యంతో సహా మిమ్మల్ని వెంబడించి వస్తాడు. జరాసంధుణ్ణి జయించటానికి అనుకూలంగా ఉండే దుర్గం ఒకటి ఉన్నది. నేను మీ వెంట వచ్చి అక్కడ దిగ విడుస్తాను," అన్నాడు.

ముగ్గురూ కలిసి బయలుదేరారు. వారు కొన్నిరోజులు నడిచి గోమంత మనే పర్వతాన్ని చేరారు.

గోమంతం ఒక మహా పర్వతం. దానికి ఒకే ఒక శిఖరం ఉన్నది. ఆ పర్వతం మీదికి వెళ్ళి ఆ శిఖరాన్ని చేరుకున్నట్టయితే, అక్కడి నుంచి సూర్యచంద్రులు ఉదయించే చోటూ, అస్తమించే చోటూ దగ్గిరలో



ఉన్నట్టే కనిపిస్తాయనీ, అనేక లంకలతో సహా సముద్రం కనిపిస్తుందనీ పరశురాముడు బలరామకృష్ణులకు చెప్పాడు.

"మీ రీ కొండ మీద నుంచి యుద్ధం చేసినట్టయితే జరాసంధుడూ, అతని వెంట వచ్చిన రాజులూ, ఓడి వెళ్ళిపోతారు," అన్నా డాయన.

ఆ తరువాత ముగ్గురూ అతి వేగంగా పర్వతం పైకి ఎక్కారు.

"మీ శత్రువులు చేరవస్తున్నట్టు ధ్వనులు వినిపిస్తాయి, మీరు మహా జాగ్రత్తగా ఉండండి. ఇక నేను వెళ్ళి వస్తాను," అని పరశురాముడు అనేసరికి, బలరామకృష్ణు లాయనను గౌరవంగా సాగనంపారు.

తరవాత బలరామ కృష్ణులు ఆ పర్వతం మీది గుహలూ, దృశ్యాలూ చూస్తూ గడిపారు. అంతలో జరాసంధుడి సేన అర్భాటంగా వచ్చి, పర్వతం చుట్టూ విడిసింది. ఆ సేనలో జరాసంధుడి వెంట శిశుపాలుడూ, రుక్మి, చేకితానుడూ, బాహ్లికుడూ, ద్రుపదుడూ, విరాటుడూ, ఉత్తమౌజుడూ, జయద్రథుడూ మొదలైన రాజులున్నారు.

జరాసంధుడు వీరందరినీ పిలిపించి సభ చేసి, "యాదవ కుమారులు ఈ కొండ మీద ఉన్నట్టు తెలిసింది. పర్వతాన్ని ఎక్క





టానికి వీలుగా రాళ్లూ, తిప్పలూ ధ్వంసం చేయింతాం. అక్కడక్కడా ఒడిసెల వాళ్ళను ఏర్పాటు చేతాం. పైనుంచి ఎవరు తొంగిచూసినా బాణాలూ, ఈటెలూ విసురుదాం. అవసరమైతే ఈ పర్వతాన్ని పిండి కొట్టి అయినా మనం వచ్చిన పని పూర్తిచేసి మరీ తిరిగి పోదాం," అన్నాడు.

దానికి శిశుపాలుడు, "ఈ పర్వతం దేవతలకే సాధ్యంకాదంటారు. రథాల మీద విశ్రాంతి తీసుకునే మన రాజులు నడిచి దీన్ని ఎక్కగలరా? చాలామందిమి ఉన్నాం గదా అని విరుచుకుపడటం నీతీ కాదు, ఉపాయమూ కాదు. బలరామకృష్ణులను పిల్లల కింద జమకట్టవద్దు. దుర్గం వాళ్ళ అధీనంలో ఉన్నది కాబట్టి, యుద్ధం చేసే కన్న ముట్టడివేసి, వాళ్ళకు అన్నపానాలు లేకుండా చెయ్యటం తెలివైన పని. మరొక ఉపాయం కూడా ఉన్నది. కొండ చుట్టూ నిప్పు పెట్టామంటే వాళ్ళు దానికి ప్రతిక్రియ చెయ్యలేక చిక్కులోపడతారు," అన్నాడు.

చేదిరాజైన శిశుపాలుడు చెప్పిన ఈ ఉపాయం జరాసంధుడికి నచ్చింది.

సైనికులు పర్వతం చుట్టూ ఎండిన మానులూ, పొదలూ, కంపా పేర్చి, గాలి వాలున అవి మండేటట్టుగా నిప్పుపెట్టి,



ఆ మంటల మీదికి కట్టెలూ, గడ్డీ ఎగదోశారు. వెంటనే పర్వతం చుట్టూ కార్చిచ్చు బయలుదేరింది. మంటలూ, నిప్పురవ్వలూ, పొగా ఆకాశంలోకి లేచాయి.

ఇదంతా చూస్తున్న బలరాముడు కృష్ణుడితో, "చూశావా, మన మూలాన ఈ పర్వతానికెంత దుర్దశ కలిగిందో! మనం చూస్తూ ఊరుకోవటం కన్న వేరే అపకీర్తి ఏముంటుంది? నే నిప్పుడే ఈ జరాసంధుణ్ణి నా భుజబలంతో చంపేస్తాను. ఇన్ని దేశాల నుంచి, ఇంతమంది రాజులు ఇంత సైన్యాన్ని వెంట బెట్టుకుని యుద్ధానికి వస్తారా? భూమిమీద రాజనేవాడు లేకుండా





చేస్తాను," అని కొండ మీది నుంచి, కింద ఉన్న సేన మధ్యకు ఎగిరి దూకాడు, ఆ క్షణమే కృష్ణుడు కూడా అలాగే దూకాడు. రెండు మందర పర్వతాలు ఒక్కసారిగా పడితే సముద్రం అల్లకల్లోలమైనట్టుగా, జరాసంధుడి సేన వాళ్ళపాటుకు చెల్లా చెదరయింది. వాళ్ళ పాదఘట్టనతో పర్వతం కొంచెం కుంగి, పాతాళ గంగ పైకి వచ్చి, మంటలు ఆరిపోయాయి.

ఆ అన్నదమ్ముల శౌర్య సాహసాలను మెచ్చి, దేవతలు ఆకాశం నుంచి వారిద్దరికీ రకరకాల ఆయుధాలు అందించారు. ఆ క్షణంలో కృష్ణుడు విష్ణుమూర్తి లాగానూ,



బలరాముడు సహస్రఫణాలు గల ఆది శేషుడు లాగానూ కనిపించారు. వాళ్ళిద్దరూ విజృంభించి సైన్యాన్ని ఎడాపెడా వధ చేస్తూంటే రాజులు పారిపోసాగారు.

వాళ్ళను వెనక్కు పిలుస్తూ జరాసంధుడు, "యుద్ధంలో వెన్నిచ్చి పారిపోయే వారికి భ్రూణహత్యాపాతకం లాటిది చుట్టుకుంటుందని పెద్దలు చెప్పారు. మీరంతా మహామహా యోధులై ఉండి, ఇద్దరు గొల్లపిల్ల వాళ్ళకు దడిచి పారిపోతున్నారా? మీరు కాలుతొక్కుకు నిలబడి నన్ను చూడండి. నేనుండగా మీకే అపాయమూ రానివ్వను. ఈ యాదవులను నా బాణాలకు ఎరచేసేస్తాను," అన్నాడు.

ఈ మాటలు విని పారిపోయే రాజులు వెనక్కు తిరిగి, తమ సేనలను వెనక్కు తిప్పి, బలరామకృష్ణులను చుట్టుముట్టారు. అంతమంది తమ పైన వివిధాస్త్రాలనూ, శస్త్రాలనూ ప్రయోగిస్తున్నా చలించక, బలరామకృష్ణులు తమ చుట్టూ ఉన్న సేనను ఊచకోత కోస్తూ, పీనుగు పెంట కుప్పలు వేశారు. రాజులు క్రమంగా వెనక్కు తగ్గసాగారు. అప్పుడు కృష్ణుడు వారితో, "అందరూ వాహనాలెక్కి ఉన్నారు; అందరూ అనేక యుద్ధాలలో ఆరితేరినవారే;







నేల మీద నిలబడి యుద్ధంచేసే మమ్మల్ని ఎదుర్కోలేక వెనక్కు తగ్గటం ఏమీ బాగా లేదు. మిమ్మల్ని అడ్డంపెట్టుకుని ఆ జరా సంధుడు దూరదూరంగా ఉంటున్నాడు. అతని కోసం మీరెందుకు చావాలి? అతన్ని పట్టుకురండి, నా యుద్ధ పటిమ చూపి స్తాను," అన్నాడు,

ఈ మాట విని జరాసంధుడు, పౌరుషం వచ్చి, ఒక రథం మీద ఒంటరిగా కృష్ణు డున్న చోటికి వచ్చాడు. అతను కృష్ణుణ్ణి చూసి, "నేనుండగా మధ్య ఈ రాజుల నెందు కవమానిస్తావు? యుద్ధ మంటే అడవిలో పశువులను కాయటం కాదు. నువేదో మహా బల పరాక్రమాలు కలవాడి విట. అదంతా నా మీద చూపించినప్పుడు గదా సార్థకమయేది? నువు నిలిచి పోట్లాడు. క్షణంలో నిన్ను యమధర్మరాజు దగ్గిరికి పంపేస్తాను," అన్నాడు.

"నా ప్రతాపం తెలుసుకో గోరితే నేను ఎదటే ఉన్నాను గద. శూరుడు ప్రగల్భా లాడరాదు. నీ శస్త్రాస్త్రపటిమ చూపించు," అంటూ కృష్ణుడు జరాసంధుడి పైన ఎని మిది బాణాలూ, అతని సారథిపైన అయిదు బాణాలూ వేశాడు. ఆ క్షణంలోనే బల రాముడు జరాసంధుడి చేతిలోని వింటిని తన బాణాలతో విరగగొట్టాడు. జరాసంధు డికి కాపుగా అతని సేనాపతులు, కౌశిక చిత్రసేను లనేవాళ్ళు, బలరామకృష్ణుల మీదికి వచ్చారు. యుద్ధం అతి దారుణంగా సాగింది. యుద్ధంలో దెబ్బతిని కృష్ణుడూ, బలరాముడూ, జరాసంధుడూ కూడా ఒకరి తరవాత ఒకరు మూర్ఛపోయారు. జరా సంధుడి పక్షాన కొందరు చచ్చారు. చివరకు జరాసంధుడు నిలవలేకపోయాడు. అతనూ, అతని సేనా ఓడి పారిపోయారు. కృష్ణుడు విజయగర్వంలో పాంచజన్యం ఊదాడు.

బలరామకృష్ణులు కొంత కాలంపాటు గోమంతగిరి మీదనే విశ్రాంతి తీసుకుందా



మని నిశ్చయించారు. అంతలో ఒక చిత్ర మైన సంఘటన జరిగింది.

జరాసంధుడి వెంట రాజులందరూ వెళ్ళి పోయారు. అయితే చేదిదేశపు రాజైన దమ ఘోషు డనేవాడు, శిశుపాలుడి తండ్రి, తన సేనలతోసహా గోమంతానికి తిరిగివచ్చి, కృష్ణుణ్ణి కలుసుకుని, "నాయనా, నేను మీ మేనత్త పెనిమిటిని. నా పేరు దమ ఘోషుడు. ఈ జరాసంధుడు మరీ ధూర్తుడు. కృష్ణుడితో వైరం వద్దని చాలా సార్లు చెప్పి చూశాను, కాని విన్నాడుకాడు. వాడంటే భయంగాని, లేకపోతే ఎన్నడో విడిచిపెట్టి ఉందును. ఇవాళ వాడి ఓటమి చూసి, నాకు అయిన వారందరితో సహా నీ పక్షం వచ్చేశాను. కాని వీడు బలవం తుడు. ఇంతటితో వీడి పీడ విరగడ అయిం దనుకోకు, మళ్ళీ ఏదో వంక వెతుకుతాడు. ఈ పీనుగు పెంటల మధ్య ఇంకా నువు దేనికి ఉన్నట్టు? పోదాంపద. ఇక్కడికి దగ్గరలోనే కరవీరపురం అని ఉన్నది. దాన్ని పాలించే సృగాల వాసుదేవుడికి నీ పైన చాలా ఈర్ష్య. వాణ్ణి అణచటం అవసరం. ఇవిగో, రెండు ఉత్తమ రథాలు. వీటిని మీ అన్నదమ్ము లిద్దరూ తీసుకోండి," అన్నాడు.

కృష్ణుడు దమఘోషుణ్ణి అభిమానంతో చూసి, "బంధుత్వంతో గూడిన ప్రేమ అంటే ఇలాగే ఉండాలి. నీ మాటలు మాకు మహదానందం కలిగించాయి. నీవంటి వాడి ప్రాపు దొరకటంచేత మేము ధన్యులం. ఇప్పుడు జరిగిన యుద్ధం చూశావుగద! ఇదే పద్ధతిలో మేము ఎన్ని యుద్ధాలైనా చెయ్య గలం," అన్నాడు.

ఆ రోజే బలరామకృష్ణులు రథాలెక్కి దమఘోషుడి బలాల వెంట బయలుదేరి, దారిలో రెండు మజిలీలు వేసి, మూడో నాడు ఉదయం కరవీరపురం చేరి అక్కడ శిబిరం వేశారు.





# అరణ్యపురాణం

## 16

మౌగ్లీ పసివాడుగా తోడేలమ్మ పెంపకం లోనే ఉండి, భాలూ వద్ద విద్యాభ్యాసం చేసే రోజుల్లోనే అతనికి మరొక స్నేహితుడు దొరికాడు. ఆ స్నేహితుడు "కావా" అనే సర్పం....

భాలూకు ఎదురుగా కూర్చుని మౌగ్లీ పాఠాలు పప్పజెప్పేటప్పుడు ఎప్పుడైనా బాఘీర వచ్చి, తన తలను ఒక చెట్టుకు ఆనించి, గుర్రుపెడుతూ ఆలకించేవాడు.

మౌగ్లీ మనిషికూన కావటంచేత నేర్చుకోవలసినది చాలా ఉండేది. అతనికి అప్పటికే చెట్లెక్కటమూ, ఈదటమూ పరిగెత్తటమూ చాతనవును. ఒక కొమ్మ పుచ్చుదో కాదో ఎలా తెలుసుకోవాలి? అడవి తేనెటీగలను ఎలా పలకరించాలి? చెట్టు కొమ్మల మీద ఉండే గబ్బిలాయి మాంగ్‌కు నిద్రా భంగం కలిగించినప్పుడేమనాలి? నీటిలో దూకేముందు నీటిపాములకు ఎలాటి హెచ్చరిక ఇవ్వాలి? అన్నిటికన్నా ముఖ్యమైనది, ఇతర ప్రాంతాలలో వేటాడబోయేటప్పుడు అక్కడి వారికి ఏ విధమైన హెచ్చరిక ఇవ్వాలి? అందు కొక వేట కేక ఉన్నది. దాన్ని మనిషిభాషలో చెప్పాలంటే: "నాకు ఆకలిగా ఉన్నది కాబట్టి, వేటాడటానికి అనుమతి ఇవ్వండి," అని అవుతుంది. వేటకేకకు జవాబు కూడా వస్తుంది. దాని అర్థమేమిటంటే: "అయితే ఆహారం కోసం వేటాడు, కాని వినోదం కోసం వేటాడకు."

భాలూ శిక్షణ బాఘీరకు మరీ క్రూరమనిపించినప్పుడు, "ఎందుకు కుర్రవాణ్ణి మరీ అంతగా అరగదీస్తున్నావు?" అనేవాడు.

"నీకు తెలీదు. వీడు మనిషి కూన. మన అరణ్య సూత్రాలు ఒక్కటి కూడా తీరుపోకుండా అన్నీ నేర్చుకోవలసిందే.

అట్ట చివరి బొమ్మ



ఏ తోడేలు కూనో అయితే ఆ దారివేరు; తనకు సంబంధించినవే నేర్చుకుంటాడు, వీడు మనిషికూన!" అన్నాడు భాలూ.

భాలూ శిక్షణపట్ల మౌగ్లీ అప్పుడప్పుడూ అశ్రద్ధ చూపేవాడు. అప్పుడు భాలూ మౌగ్లీ నెత్తిన ఒక మొట్టికాయ వేసేవాడు. మౌగ్లీ అలిగి ఏ చెట్టుకొమ్మల్లోనో కూర్చుని దిగి వచ్చేవాడు కాడు. అయినప్పటికీ భాలూ శిక్షణ చాలా గొప్పది. అరణ్యంలో అనేక భాష లుంటాయి. అన్ని భాషలూ మౌగ్లీకి వచ్చాయంటే అది భాలూ సమర్థతే అనాలి. పాముభాష లాటివి భాలూకు పలకవు. అందుచేత భాలూ మౌగ్లీని హథీ వద్దకు తీసుకుపోయి, ఆయన ద్వారా పాముభాష నేర్పించాడు. "ఇలా అరణ్య భాషలన్నీ నేర్పటంచేత మౌగ్లీకి అరణ్యంలో ఏ జాతి నుంచీ భయం లేదు," అన్నాడు భాలూ.

"తన జాతినుంచి తప్ప," అనుకున్నాడు బాఘీర స్వగతం.

మౌగ్లీ ఒకసారి పెద్ద నేరం చేశాడు. అది భాలూకూ, బాఘీరకూ కూడా సహించ రానిది—అతను కోతులతో స్నేహం కట్టి పచ్చాడు. అది ఎలా జరిగిందంటే, భాలూ చేత మొట్టికాయ తిని మౌగ్లీ చెట్టుకొమ్మ లలో ఎత్తున కూర్చుని ఉండగా చెట్టుమీది నుంచి నల్ల మర్కటాలు దిగివచ్చి, అతని పైన సానుభూతి చూపి, అతనికి కాయలూ, పప్పులూ పెట్టి, చిటారు కొమ్మల మీదికి తీసుకుపోయి, "తోక లేకపోతేనేం? నువ్వు మాకు సోదర జాతీయుడివి. ఎప్పటికైనా మా అందరికీ నాయకుడివి కావలసిన వాడివి," అన్నారు.

మౌగ్లీ కోతి మూకతో మాట్లాడినట్టు ఆచూకీ తగలగానే భాలూ క్రోధావేశం వచ్చి, "నువ్వు కోతి మూకతో మాటలు కలిపావా? అంతకన్న అవమానం ఉందా? వాళ్ళకే నియమాలూ లేవు, ఏదైనా తింటారు. కోతు లకు సానుభూతీ, ఎంతకు చల్లదనమూ

ఎక్కడన్నా కద్దా?" అంటూ అరిచాడు. మౌగ్లీ కంగారుపడి బాఘీర కేసి చూశాడు.

"మర్కటులు అబద్ధమాడారు. వాళ్లకు ఏనాడూ నాయకుడంటూ లేడు. వాళ్లెప్పుడూ నిజం చెప్పరు," అన్నాడు బాఘీర.

"వాళ్ళు నన్ను చాలా అపేక్షగా చూశారు. మళ్ళీ రమ్మన్నారు. నా లాగే వాళ్ళు కాళ్ల మీద నిలబడతారు. మొట్టికాయలు వెయ్యరు. రోజల్లా ఆటల్లోనే గడుపుతారు. నేను మళ్ళీ పోయి వాళ్ళతో ఆడుకుంటాను. నన్ను వదులు, భాలూ!" అన్నాడు మౌగ్లీ.

"ఓరి బుద్ధి తక్కువ మనిషికూనా! నీకు అరణ్య నియమాలన్నీ నేర్పాను. అరణ్యవాసు లందరిని గురించీ చెప్పాను- ఒక్క కోతులను గురించి తప్ప. కోతులకు నియమాలంటూ లేవు. వాళ్ళు వెలిపడ్డ వాళ్ళు. వాళ్ళకు సొంత భాష కూడా లేదు; వాళ్ళ భాషా వీళ్ళ భాషా దొంగిలించి ఉపయోగించుకుంటారు. వాళ్ళకు నాయకులుండరు. వాళ్ళ దారి వేరు, మన దారి వేరు. వాటికి జాతిస్మరణే లేదు. తాము చాలా గొప్పజాతి అనీ, ఘనకార్యాలు చేయపోతున్నామనీ గప్పాలు కొడతారు. ఇంతలో ఏ కాయో కింద రాలుతుంది. అందరూ వికవికా నవ్వి, చెబుతున్న దేమిటో కూడా



మరిచిపోతారు. పట్టి వెకిలి మూక. మన అరణ్యవాసులకు వాళ్ళతో ఎటువంటి సంబంధమూ లేదు; వాళ్ళు నీరు తాగే చోట మనం తాగం; వాళ్లు వేటాడే చోట మనం వేటాడం, ఆఖరుకు వాళ్లు చచ్చే చోట మనం చావను కూడా చావం. వాళ్లకు శుచీ, శుభ్రమూ లేదు, సిగ్గు లేదు. అరణ్యవాసుల దృష్టిని ఆకర్షించటానికి అడ్డమైన వేషాలూ వేస్తారు. కాని మనం వాళ్ళను చూడనైనా చూడం. కోతులు నీకు నిషిద్ధులు! నిషిద్ధులు!" అన్నాడు భాలూ తీవ్రంగా.

"భాలూ చెప్పేది అక్షరాలా నిజం. కాని కుర్రవాణ్ణి కోతులను గురించి ఏ నాడో

గట్టిగా హెచ్చరించి ఉండవలిసింది," అన్నాడు బాఘీర.

"వీడు వెళ్లి ఆ క్షుద్రులతో మాట్లాడతాడని నే నెలా అనుకోను?" అన్నాడు భాలూ.

మౌగ్లీ తాను చేసినపని తప్పని గ్రహించి, ఇక ఎన్నటికీ కోతులతో ఎలాటి సంబంధమూ పెట్టుకోరా దనుకున్నాడు. కాని కోతులు మాత్రం మౌగ్లీని వదిలిపెట్ట దలచలేదు.

పైన చెప్పిన సంభాషణ జరిగిన మధ్యాన్నం ఎండ వేళప్పుడు మౌగ్లీ పులికీ, ఎలుగుబంటికీ మధ్య పడుకుని, వాళ్ళతో బాటు కునుకు తీశాడు. అతనికి తిరిగి స్పృహ తెలిసేసరికి అతను చెట్టు పై కొమ్మలలో ఉన్నాడు. అనేక మర్కటాల చేతులు అతన్ని బలంగా పట్టుకుని ఉన్నాయి.

భాలూ నిద్రలేచి అరణ్యం దద్దరిల్లేటట్టు కేకలు పెట్టాడు. బాఘీర కోరలు బయట పెట్టి చెట్టుమాను ఎగబాకాడు. మర్కటులు విజయధ్వానాలు చేస్తూ పై కొమ్మలకు ఎక్కారు. బాఘీర అక్కడి దాకా ఎక్కలేడని వాళ్ళకు తెలుసు. "మనని బాఘీర చూశాడు! బాఘీర మనని చూశాడు!" అని మర్కటులు కోలాహలంగా, సంతోషంతో అరిచారు. ఆ తరవాత వాళ్ళు చెట్ల పై భాగాల మీదుగా ప్రయాణం సాగించారు—మౌగ్లీని పట్టుకుని.

కోతులకు చెట్ల మీద, భూమికి నూరడుగుల ఎత్తున రాస్తా లున్నాయి; చీలే దారులున్నాయి; దిగుడు దారులూ, ఎగుడు దారులూ, అడ్డదారులూ అనేకం ఉన్నాయి. వాటిని కోతులు మాత్రమే ఉపయోగించగలరు. ఆ దారుల వెంట వాళ్ళు అమిత వేగంగా ప్రయాణించగలరు. ఇప్పుడు మౌగ్లీని మోయవలసి రావటం చేత, వాళ్లు సగం వేగంతోనే ప్రయాణించవలసి వచ్చింది. కాని ఆ వేగం కూడా బాఘీరకూ, భాలూకూ అందుకునేటందుకు సాధ్యమైనది కాదు. —(ఇంకా వుంది)



# 70. అంటార్క్టికా శిఖరాలు

దక్షిణధ్రువప్రాంతంలో, అంటార్క్టికా ఖండం పైన ఉన్నత శిఖరాలనేకం ఉన్నాయి. వాటిలో కెల్లా ఎత్తయినది "విన్సన్" (16,860 అడుగులు). దీనిని అమెరికను ఇంజనీర్లు సులువుగానే ఎక్కారు గాని, దీనికన్న 570 అడుగులు తక్కువ ఎత్తుగల "టిరీ" (బొమ్మలోది) ఎక్కటానికి చాలా శ్రమ అయింది. వారంరోజులు శ్రమపడి దాన్ని వారు 1967 జనవరి 6 న ఎక్కారు.



Photo by Anant Desai



బహుమతి
పొందిన వ్యాఖ్య

దిక్కులేని పక్షులం

పంపినవారు :
జి. సుబ్బలక్ష్మి, కాకినాడ

Photo by P. R. Shinde



బహుమతి
పొందిన వ్యాఖ్య

దిగులులేని కూనలం

పంపినవారు:
జి. సుబ్బలక్ష్మి, కాకినాడ

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1967 నవంబర్ నెల సంచికలో ప్రకటించబడును.





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ సెప్టెంబర్ నెల 20-వ తేదీ లోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

---

## సెప్టెంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : దిక్కులేని పక్షులం

రెండవ ఫోటో : దిగులులేని కూనలం

పంపినవారు : జి. సుబ్బలక్ష్మి,

దేవాలయం వీధి, కాకినాడ.

బహుమతి మొత్తం రు. 10/— ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

## నేను డాక్టరును కావాలనుకుంటున్నాను



ఆమెను మీరు చదివించితీరాలి. ఇందుకు డబ్బు కావాలి: క్రమపద్ధతిని ఆదా చేసుకుంటే డబ్బు సమకూరుతుంది. సేవింగ్స్ స్కీములోగాని లేదా రికరింగ్ డిపాజిట్ స్కీములోగాని పంజాబ్ నేషనల్ బ్యాంక్‌లో ఖాతా ప్రారంభించండి. ఆమె కోర్కెను మీరు తప్పక నెరవేర్చగలరు.

# పంజాబ్ నేషనల్ బ్యాంక్

PR-PNB-6715 TEL.1



దిలీప్ బృందం
ప్రమాదంనుండి కాపాడారు
దిలీప్, దిలీప్, ఏదో ప్రమాదం జరిగినట్లుంది చూదివద్దాం. పద.
చూడ్రా. ఆ వ్యాన్ తిరగపడిపోయింది. డ్రైవరేడి?
ఈ చీకట్లో నాకేం కనిపించడంలేదు. వెళ్ళి నా టార్చి తీసు కొస్తానుండు.




డ్రైవరికి దెబ్బలు
వాడికి నే సహాయంచేస్తా.
దిలీప్, నీ 'ఎవరెడి' టార్చి మాకోసారివ్వు.
డ్రైవరు అదృష్టవంతుడు. ఎక్కువ దెబ్బలు తగల్లేదు.
అబ్బాయిలూ, ధన్యవాదాలు. మీ మేలు మరువలేను. నా సరుకుకూడా దక్కింది.
మాకు కాదు ధన్యవాదాలు! ఈ 'ఎవరెడీ'కి ధన్యవాదాలు చెప్పండి!


M.V.N.S. ప్రొడక్షన్స్ సమర్పించు
పెళ్ళంటే భయం!
దర్శకత్వం: K. శంకర్
మాటలు - పాటలు: శ్రీశ్రీ
సంగీతం: పామర్తి & M.S. విశ్వనాథం
కూర్పు: R. హనుమంతరావ్
నిర్మాతలు
M.K. గంగరాజు
M. వెంకటేశ్వరరావు
BRP

